ఐతిహాసిక కుసుమములు

ప్రథమకుసుమము.

# భారతదాస్యము.

ప్రథమముద్రణము 2000 కాపీలు

తాడిపత్రి దేశబంధుముద్రణాలయము వారిచే

ముద్రింపబడి

లక్ష్మీస్టోర్సువారిచే ప్రకటింపబడినది.



 1926. 0—4—0

# పీఠిక

అన్నలారా!

ప్రస్తుతవిద్యావిధానము ననుసరించి మనకునేర్పబడుచరిత్రములు కొంతవఱకు సత్యదూరములగుటయేకాక మనమనస్సులలో దాస్యభావమునుకల్గించి దానినిబలకొనచేయుచున్నవి. ఈలోపమును తొలగించి దేశభక్తిని ప్రోత్సహింపగలచరిత్రములనల్పముగ గరపత్రములరూపముగ నప్పటప్పటికి ప్రచురించుదలంపు చిరకాలమునుండియుండినది. ఈశ్వరానుగ్రహమునను నంద్యాలవకీలు, మ॥రా॥శ్రీ॥ పాణ్యంరామచంద్రయ్య బి. ఏ. గారి ద్రవ్యరూపక సానుభూతికారణముగ నిప్పటికి ఐతిహాసిక కుసుమములనుపేర గరపత్రముల నాంధ్రదేశమునకిచ్చి యాశయము పూర్తిజేసికొన నారంభింపగలిగితిమి.

భారతదాస్యమనునిది యెందలిపరిశ్రమకుసుమము. చరిత్రకాలమునాటినుండి, యేయేకాలము లందెవ్వరెవ్వరిచే నీ భారతదేశమెట్లాక్రమింపబడినదో, యెట్టిప్పటిదాస్యస్థితికలిగినదో సంగ్రహముగ విశేషవివరములను జెప్పలేకున్నను వ్రాయ యత్నించితిమి. తప్పుచేయగలశక్తి మాకులేకపోలేదు. పరిశ్రమప్రయత్నమైనందున నిదియనేక విధములైనకొఱతలతో నైయుండవచ్చును. దేశసేవయేకాని పండితులమనిపించుకొను వాంఛతో నిందుకు గడంగుటలేదు. మాలోపములదెల్పి మమ్ము చక్కగ నడుపువారందఱకు కృతజ్ఞులము. మాయత్నము సఫలింపజేయ నెల్లరను వినయపూర్వకముగ ప్రార్థించుచున్నాము.

ఓం

శ్రీ గురుభ్యోనమః

వందేమాతరం

౧

ఈచరాచర ప్రపంచమంతయు కలిసి 197,000000 చదరపుమైళ్లు. దీనిలో దాదాపు మూడుపాళ్లు నీళ్లు, ఒకపాలుభూమి. ఈనీళ్లు భూమిచుట్టు ఆవరించికొనియున్నవి. భూమిలో అత్యున్నతశిఖరము 5½ మైళ్లుఎత్తు. సముద్రములో ఇదివరకు కనిపెట్టబడిన లోతుకూడదాదాపు 5½ మైళ్లు. ఈయొకపాలుభూమిలో, జలచరాదులుతప్ప, మిగతసమస్తజీవరాసులును, వృక్షములు, పర్వతములు, నదులుఅన్నియు ఇమిడియున్నవి. ఈ భూమి ఆరు గొప్పఖండములుగ విభజింపబడినది; ఆసియ, ఐరోపా, ఆఫ్రికా, ఉత్తరఅమెరికా, దక్షిణఅమెరికా, ఓషియేనియ. వీటిలో ఆసియాఖండము చాలాగొప్పది. దీనివిస్తీర్ణము 16,000000 చదరపు మైళ్లు. ఐరోపాఖండము చాలాచిన్నది. దీనివిస్తీర్ణము 4,000000 చదరపుమైళ్లు. ఆఫ్రికాఖండము ఐరోపాఖండమునకన్న మూడంతలుపెద్దది. భూమిచుట్టును ఆవరించియుండు నీళ్లనుకూడ అయిదువిభాగములు చేయబడినవి: పెసిఫిక్ మహాసముద్రము, హిందూమహాసముద్రము, అట్లాంటిక్ మహాసముద్రము, ఆర్టిక్, అంటార్టిక్ మహాసముద్రములు. వీటిలో పెసిఫిక్ మహాసముద్రము చాలాగొప్పది. భూగోళములో మూడింట ఒకభాగమును ఆక్రమించుకొని ఆసియాఖండ

ముునకు తూర్పుభాగమునయున్నది. దీనిలోఅనేకద్వీపరాజములు న్నవి. వాటిలో జపానుదీవులుచాల ముఖ్యమైనవి. అంట్లాంటిక్ మహాసముద్రము పెసిఫిక్ మహాసముద్రములో అర్ధమున్నది. ఇయ్యదిపాశ్చాత్యదేశములగు ఐరోపా, అమెరికాఖండములు, ఆఫ్రికాఖండములనడుమ యుండుటబట్టి విశేషముగ జనసంచారమునకు ఆకరమైనది. యూరపు ఖండమునకు పశ్చిమముననుండు బ్రిటీషుదీవులు ఇందులోనివియే. హిందూమహాసముద్రము మనమాతృభూమియగు ఇండియాదేశమునకు దక్షిణముననున్నది. ఆర్టిక్ అంటార్టిక్ మహాసముద్రములలో, చాలభాగము మంచుగడ్డలతోకూడియున్నది.

<u>ఆసియాఖండము:</u> ఇది ఇతరఖండములకన్న గొప్పది భూమిలోమూడింట ఒకభాగమును ఆక్రమించుకొన్నది. దీనిలో ప్రపంచోన్నతశిఖరమగు హిమాలయపర్వతములున్నవి. ఈహిమాలయపర్వతములకు దక్షిణముననుండువిశాలమగుప్రదేశమే మనమిపుడు నివసించుచుండు భారతదేశము. సమస్తలోహములకు, వజ్రవైడూర్యాదిమణులకు నిలయము. ప్రపంచమున చాలప్రఖ్యాతిగాంచిన వజ్రములు భారతభూమిలో దొరికినవే. వడ్లు, జొన్నలు, గోధుమలు, టి, కాఫీ, అనేకములగు ఫలపుష్పాదులు ఇచటవిశేషముగ పండును. ప్రత్తి, నీలిమందు, చెరుకు, మొదలగుపారిశ్రామిక వస్తువులుచాలవిశేషము. వివిధమృగములు, పక్షులు సుమారు 80 కోట్లుప్రజలుకలిగి చాలాప్రాముఖ్యత నరఫియున్నది. ఇది మ

నిషియొక్క ఆదినివాసము, అనేకసామ్రాజ్యములకు బునాది, సమస్తమతములకు జన్మస్థానము.

ఐరోపాఖండము: ఇతరఖండములకన్న ఇదిచాలా చిన్నది. మనభారతదేశమునకు మూడంతలున్నది. ప్రపంచములో ప్రఖ్యాతిగాంచినయుండు పాశ్చాత్యజాతులకు పుట్టినిల్లు. ప్రస్తుతనాగరతకు పట్టుగొమ్మ. లోహములలో, ఇనుము, సీసము, తామ్రము, రాతిబొగ్గుముఖ్యమైనవి. యూరపుదక్షిణభాగమునందు, గోధుమ, వడ్లు, మొక్కజొన్నలు, పండును. కాని ఐరోపాఖండవాసులు ముఖ్యముగ తమ ఆహారపదార్థములకు ఇతరదేశములమీద ఆధారపడియున్నారు. యూరపుఖండము వైశాల్యమున చాలచిన్నదిగనుండినను,జనసంఖ్యఎక్కువ: ఒక చదరపుమైలునకు సుమారు 188మందినివసించుచున్నారు. ఆసియాఖండమున ఒకచదరపుమైలునకు 46మందిమాత్రమే నివసించుచున్నారు. యూరపుఖండవాసులు పరిశ్రమలయందును వ్యాపారమునందును చాలాపేర్వడసినారు. ఐరోపాఖండవాసులు తమచాకచక్యముచే ప్రపంచములో ¾ భాగమును తమవశమునందుంచుకొన్నారు.

అట్లాంటిక్ మహాసముద్రమున బ్రిటీషుదీవులుగలవు. దీనికిగ్రేటుబిటను (Great Britain) అనిపేరు. ఇదియేమనప్రభువులగు ఆంగ్లేయుల మాతృభూమి. దీనికిలండనుపట్టణము ప్రధాననగరము. ఈదీవులు మనదేశమునకు సుమారు 6000మైళ్లదూరముననున్నవి. వీరు సూర్యుడస్తమించని సామ్రాజ్యమునక

భిషిక్తులు. ఈదీవులలో ఇనుము రాక్షసిబొగ్గు విస్తారముగదొరకును. దీనినాధారము చేసికొని వీరుఅనేకపరిశ్రమములను నెలకొల్పి, మనఇండియాదేశముతో గొప్పవ్యాపారమును కొనసాగించుచున్నారు. కొద్దిగా గోధుములుమాత్రముపండును.

ఆఫ్రికాఖండము: ఇది యూరపుఖండమునకు మూడంతలుపెద్దది. ఈజిప్టుదేశమున ప్రవహించునైల్ నది చాలపెద్దది. చాలఉష్ణప్రదేశము. బంగారు, వజ్రములు, విశేషముగ దొరకును. గోధుమలు, వడ్లు, ప్రత్తి, మొదలగునవి పండును. ప్రజలునల్లజాతివారు. ముఖ్యముగమహమ్మదీయులు, నీగ్రోలు, ఆఫ్రికాఖండవాసులు. కాని ఖండమంతయు, పాశ్చాత్యజాతుల స్వాధీనములోనున్నది. దక్షిణాఫ్రికాలోనుండు శ్వేతజాతులు, మనదేశమునుండి వలసపోయినవారికి సమానహక్కులునివ్వక పలువిధములకష్టపెట్టుచున్నారు.

అమెరికా: ఇది వైశాల్యమునగొప్పది. బంగారు, వెండి, దొరకుటయేగాక, ఇనుము, రాక్షసిబొగ్గు, పెట్రోలియం కూడ విస్తారముగాదొరకును. గోధుమలు, వడ్లు, చెరుకు, ప్రత్తి, మొదలగు సస్యములుకూడ విశేషముగపండును. ఉత్తర ఆమెరికాలో ఎక్కువమంది పాశ్చాత్యులే. దక్షిణఅమెరికాలో కొంతభాగమునమాత్రము నీగ్రోలు, ఇతరజాతులునివసించుచున్నారు. పరిశ్రమలయందును, వ్యాపారమునందును, ఐరోపాఖండవాసులతో తులదూగుచున్నారు. ఐరోపాఖండవాసులకన్న, వీరికి ప్రకృతిఎక్కువసౌకర్యములను కలుగజేసినది.

అమెరికా దేశములో చాలగొప్పధనవంతులున్నారు.

౩

పాశ్చాత్యదేశీయులు, భౌతికవిద్యలయందు సర్వముఖముల మిన్నగనున్నారు. వీరిదేశములు కేవలము సారవంతములుగాఉన్నను, వీరుధనమును విశేషముగ సేకరించినారు. వీరికి ధనార్జనయందున్న ఆపేక్ష, ఆధ్యాత్మకచింతయందులేదు. వీరు ఐహికసుఖములను తుష్టముట్టననుభవించుటయందే తమశక్తిసామర్థ్యములను పూర్ణముగ వినియోగించుచున్నారు, వీరుక్రైస్తవమతావలంబులు, కానిఆమతముఖ్యసూత్రములను పాటింపకపోవుటయందే, పేరువడిసిరి.

సామాన్యముగ వీరందరు సంపూర్ణస్వాతంత్ర్యమనుభవించుచున్నారనియే చెప్పవచ్చును. వీరిదేశములలో, గ్రేటుబ్రిటను (బ్రిటీషుదీవులు) ఫ్రాంస్సు, జర్మని, అమెరికా, దక్షిణ ఆఫ్రికా, ఎచ్చటజూచినను ప్రజాస్వామ్య ప్రభుత్వములే (Democr acies)ప్రబలియున్నవి.కొన్నిటిలో రాజువున్నను,అతనికి అధికారముసున్న. మనప్రభువులుగనుండు, ఆంగ్లేయులను రాజేపరిపాలించుచున్నాడు. కానిఇతడు స్వతంత్రించిఏకార్యమునుచేయలేడు.ఇతడుబ్రిటీషురాజ్యాంగ ప్రధానమంత్రి చెప్పినరీతి నడుచుకొనవలెను.ఇతడు కేవలము లాంఛనమాత్రుడే. నిజముగ ఇంగ్లండును పరిపాలించునది ప్రజాసభ.మనమిపుడుమనశాసనసభలకుప్రతినిధులనెన్నుకొనురీతి; ఈసభలకుఆదేశపుప్రజలు తమ తరఫునప్రతినిధులనెన్నుకొనిబంపుదురు. ఈప్రజాప్రతినిధులం

దరుచేసి తమలోనొక నాయకుని నియమింతురు. ఈనా యకుని, రాజు ప్రధానమంత్రిగ సంగీకరించి, మిగతమం త్రివర్గము నేర్పరచుకొనుమని చెప్పును. (ఈప్రతినిధు లు ప్రతిఅయిదు సంవత్సరములకొకతూరి ఎన్నుకొనబడు దురు.) ప్రధానమంత్రి చేయుకార్యములన్నిటికిని రాజుతల యూచుచుండును. మంత్రిపొరబాటుచేసినను, ప్రజాహితము నకు వ్యతిరేకముగ ప్రవర్తించినను ప్రజాప్రతినిధులు అతని నితొలగిసిపుచ్చుదురు. కావుననే నిజమగు అధికారమంతయు ప్ర జాప్రతినిధులలో నున్నదనియు, రాజువీరిచేతిలో కీలుబొమ్మ యని చెప్పితిమి. ప్రజాప్రతినిధిసభతోపాటు, ప్రభువులసభయొ కటున్నది. ఇందులోనుండు సభ్యులందరు ధనవంతులు. ప్రజా ప్రతినిధులసభలో ఆమోదింపబడిన ప్రతియంశమును, వీరుకూ డఆమోదింపవలెను. వీరు ౧,౨ తూర్లు ఆమోదించక కొంత కాలముగడుపవచ్చును. కాని ప్రజాసభలో పలుమార్లు అంగీక రింపబడిన యేచట్టమునుగాని వీరికిపూర్తిగ త్రోసిపుచ్చుటకుఅ ధికారములేదు. ప్రజాసభ ఉద్రేకసమయమున జేసినచట్టముల లో తొందరపాటువలనగలిగిన పొరబాట్లుండిన సవరించుకొను టకుప్రభుసభ అవకాశముకలుగజేయును.

ఇక ఫ్రాన్సు, జర్మని, అమెరికా, మొదలగుదేశముల లో రాజులేనేలేడు. వీటిని రిపబ్లిక్కు(ప్రజాప్రభుత్వములు)అనిపి లుతురు. ఈదేశములలో, ప్రజలే తమప్రతినిధులద్వారా, పరి పాలనగావించుకొందురు. బ్రిటీషుదీవులలోవలెనే, ప్రజలేతమ

ప్రతినిధుల నెన్నుకొందరు. వీరు లములోనుండి ఒకనాయకుని ని యమింతురు. ఇతడే ప్రధానమంత్రి. ప్రధానమంత్రి తనకనుకూలురుగనుండువారిలోనుండి మంత్రివర్గమేర్పరుచును. ఈమంత్రివర్గమువారు ప్రజాప్రతినిధులలో ఎక్కువమంది విశ్వాసమును నిల్పుకొన్నంతవరకు అవిచ్ఛిన్నముగా పరిపాలనగావింతురు. ఏనాడు యెక్కువమంది వీరికార్యములను త్రోసిపుచ్చుదురో, ఆ నాడు ప్రధానమంత్రి రాజీనామయిచ్చును. ఈరాజీనామాతో ఆమంత్రివర్గముమారిపోవును. మరలకొత్తమంత్రి, మంత్రివర్గ ముయేర్పడును. ఈప్రజాసభలకు క్లుప్తముగ వారుఏర్పాటుచేసుకొన్న చట్టప్రకారము కాలపరిమితి కలదు. సామాన్యముగ ఈకాలపరిమితి 3 మొదలుకొని 7 సంవత్సరములవరకు అనిచెప్పవచ్చును. యిదేరీతిగ జర్మని, హాలెండు, స్విట్జెర్లెండు, అమెరికా మొదలగు దేశములలో, ప్రభుత్వములుజరుగుచున్నవి. ఎక్కువభేదములు అగుపడవు.

పైయంశములనుబట్టి ఐరోపియనులు, పరిపూర్ణమగు స్వాతంత్ర్యమును అనుభవించుచున్నారనుట విదితము. దీనింబట్టియే, పాశ్చాత్యులు సర్వతోముఖముగ యభివృద్ధినొందుటకవకాశమేర్పడినది. పాశ్చాత్యదేశీయులలో సామాన్యముగ విద్యరానివారరుదు. 100కి 91మంది విద్యనేర్చినవారుకలరు. ఈవిద్య, మనవారు వేలకువేలుఖర్చుపెట్టి గుమాస్తాగిరిజేయుటకై నేర్చుకొనువిద్యకాదు. మానవుని స్వతంత్రజీవనము నకు ఆధారభూతమగువిద్య. పారిశ్రామిక విద్యలన్నియు వే

ర్పబడును. రాజకీయవాఙ్మయ విజ్ఞానమొసగి మనోనైర్మల్య ముకు గలిగింతురు. పత్రికాప్రచారము చాలా మెండు. మరియును ప్రభుత్వమువారు, తమదేశములలోనుండు పరిశ్రమలను, కళలను కడుశ్రద్ధతో బోషింతురు. వలయునపుడు ఉచితముగాద్రవ్యసహాయము జేతురు. ఇతర దేశములనుండి వచ్చుపదార్థములపై ఎక్కువ సుంకము విధింతురు. తమపదార్థములను చౌకగాఇతరదేశముల యందమ్ముటకు వలయుసౌకర్యము లేర్పరతురు. ఈరీతిగ, తమతమదేశములలో చైతన్యమునులవిచ్ఛిన్నముగ బోషింతురు. ఇదంతయు స్వాతంత్ర్యమనుభవించుటవలన కలిగినఫలము. కావుననే పాశ్చాత్యదేశీయులుభౌతికసుఖప్రపంచమున విచ్చలవిడివిహరించుచున్నారు. పరాధీనతను వారు పూర్తిగబారద్రోలి "సర్వమాత్మవశం సుఖం" అను నార్యోక్తి తమజీవితములపట్ల సార్థకపరచిరి. కారణాంతరములచే, ప్రాచ్యజాతులు వీరియధీనమగుటచేతను, వారిధనముసర్వమువీరిదేశముచేరి, యింకనుజేరుచుండుటచేతను, పరాధీనతాపిశాచము ప్రాచ్యులవిడువజాలకుండుటచేతను, వీరగ్రస్థానమలంకరించి, యంతనైతికులుకాకపోయినను, పూజ్యులై విచ్చలవిడిగ విహరించుచున్నారు. ప్రాచ్యవిజ్ఞానము, సంపద, కళాకౌశలములు, అన్నియునేడు దీర్ఘనిద్రావస్థబొందినవి.

## 3

ప్రాచ్యభూములలో; ఆసియాఖండ మున్నతస్థానమలంకరించుచున్నది. వైశాల్యమునందేమి, వస్తుసంపదయందేమి, జ

సబాహుళ్యమునందేము, ఇతరఖండములకన్న నెన్నిరెట్లో సంగతులు గొప్పదిగానున్నది. ఇంతేకాదు. మనుష్యునికి ఆదిమ నివాసమై సామ్రాజ్యములకు జన్మస్థానమై, సమస్తమతములకు జీవనాధారమై, ఆధ్యాత్మికవిద్యకుపుట్టినిల్లై వెలయుచున్నది. వెయ్యేల; ఇతరఖండవాసులు, పశుప్రాయులై, మృగాదులనుభక్షించుచు, మిక్కిలియజ్ఞానదశలో నున్నపుడు, ఆసియాఖండవాసులు, ముఖ్యముగ భారతీయులు, సమస్తవిజ్ఞానముతోకూడి, వస్తుసంపదలతో తులతూగుచుండిరి. భారతసామ్రాజ్యరవి తనకిరణములచే, వీరియజ్ఞానాంధకారమును పారద్రోలి, జ్ఞానమును ప్రసాదించినాడు.

ప్రాచ్యదేశీయులు, (భారతీయులుముఖ్యముగ) సహజముగ ఆధ్యాత్మికదృష్టిగలవారు. మిక్కిలినిరాడంబరజీవితులు. క్షణికములగు భౌతికసుఖములయందు హేయబుద్ధిగలవారు. ఆముష్మికసుఖములను చూరగొనుటకై తమసర్వశక్తులను వినియోగించువారు. సామ్రాజ్యాధిపత్యములన్నియుకూడ, ధర్మమందు దీక్షగలవారు. రాజ్యోపభోగములు నశింపనున్నను నీతికి అవగింజంతైనను తొలగువారుకారు. ధర్మరక్షణకై తమప్రాణములనుత్యజించుటకైనను జంకరు:

మ॥ నిరయంబైననిబద్ధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైన కులాంతమైన నిజమున్ రానిమ్ముకానిమ్ము
పో,హరుడైనన్,హరియైననీరజభవుండభ్యాగతుండైననే,ది
రుగన్నేరదునాదుజిహ్వవినుమాధీవర్య వేయేటికిన్॥ భాగ॥

కావుననే, పాశ్చాత్యదేశీయులు, తమవిజ్ఞానబలమంత యు, ఆత్మరక్షణకై అవంతయువినియోగపడదని గ్రహించి, తమదృష్టినిప్రాచ్యవిజ్ఞానమువైపునకు మరల్చిరి. ఎన్నిఅడ్డుదగిలిన ను ప్రాచ్యనాగరకత, తనవ్యక్తిత్వమును ఈనాటికికూడ నిల్పు కొన్నది.

కానిప్రాచ్యదేశీయులు అందులోముఖ్యముగ భారతీయు లు, అనేకవిపత్పరంపరలకులోనైనారు. పరాధీనతవారిని పీడిం చుచుండు గొప్పపిశాచము. దీనివలననే, నేడుభారతీయులలో చైతన్యమునశించినది. వృత్తులు అడుగంటినవి. అజ్ఞానముపెచ్చుపెరిగినది. దారిద్ర్యమునిండి నిబిడీకృతమైనది. కావుననేబట్టకు, కూటికిగూడ మనము దాసులమైనాము. ఇతరదేశముల పరిహాసము నకు పాత్రులగుచున్నాము.

ప్రాచ్యదేశములలో పరాధీనతాకళంకమునుపోగొట్టికొని యుండునవి జపాను, చైనా దేశములు. జపానుదేశమును స్వదేశీయుడగు రాజుపరిపాలించుచున్నాడు. ఇతడుప్రజాభిప్రాయ మునకులోబడి వారియిష్టానుసారము రాజ్యమును పరిపాలించును. జపానీయులు తమవేషభాష ఆచారములందు పూర్తిగపాశ్చాత్యులను అనుసరించుచున్నారు వీరుబౌద్ధమతావలంబులు. కాని, వీరియందుకూడ మతమునందు ఆసక్తితక్కువ. భౌతికవిద్యలయందు పాశ్చాత్యదేశీయులకేమాత్రము వెనుదీయరు. వీరిలోకూడవిద్యనేర్చిన వారిసంఖ్య 100కి 81, పరిశ్రమలనెక్కువుగ నెలకొల్పిఇతరదేశములతో గొప్పవ్యాపార

ముకొనసాగించుచున్నారు. ముఖ్యముగమనభారతదేశముతో గొప్పవ్యాపారము జరుపుచున్నారు. ఆసియాఖండమున పాశ్చాత్యనాగరకతను, తు, చ, తప్పక అనుకరించినది యీదేశ మొకటియె.

చైనాదేశమునరాజులేదు. ఇటీవలవీరు రిపబ్లికును స్థాపించిరి. కానిపరిపాలన ఇంకను సక్రమపద్ధతులమీద ఏర్పడినట్టులేదు. వ్యాపారమనెడి సమ్మోహనాస్త్రముతో, పాశ్చాత్యులు, ఈదేశవాసులను, బంధించియున్నారు కావుననే, ఈదేశమందు జపానుదేశమునందువలె యభివృద్ధియగుపడదు. పరిశ్రమలయందేమి, విద్యయందేమి, ఇతరఅభివృద్ధులయందేమి, చీనాదేశము మనహిందూదేశమునకన్న నెక్కుడు ఉచ్ఛస్థితిలోలేదు. కాని చైనాదేశమువారు స్వతంత్రులుగాన, ఇతరదేశములతోపాటు యభివృద్ధిబొందుటకు యవకాశములు కలిగియున్నారు.

౪

ఆసియాఖండపు దక్షిణభాగమున త్రికోణాకారముగనుండునది భారతదేశము. ఇదియేమనము నివసించుచున్న పవిత్రభూమి. దీనినేయిప్పటిభాషలో ఇండియా దేశమందురు. దీనికిఉత్తరమున అత్యున్నతములగు హిమవత్ పర్వతములును, పూర్వ, దక్షిణ, పశ్చిమభాగములందు సముద్రములున్నవి. దీనివైశాల్యము 150,00000 చదరపుమైళ్లు. జనసంఖ్యదాదాపు 33కోట్లు. సింధు. గంగా, బ్రహ్మపుత్ర, నర్మద,

కృష్ణ, గోదావరి, కావేరి, మొదలగుపవిత్రనదులు, ఈ స్వామిని సారవంతముగ చేయుచున్నవి. బంగారు, వజ్రములు, ఇనుము, రాతిసిబొగ్గు, మొదలగువస్తువులు విశేషముగదొరకును. వడ్లు, గోధుమలు, రాగులు, జొన్నలు, చెరుకు; ధాన్యములు ప్రత్తి నిలిమందు, పొగాకు, టి. కాఫీ, పనస, నారింజ, నింబ, అరటి మామిడి, మొదలగుఫలములువిశేషము. వేయేల; మానవసౌఖ్యమునకు వలయువస్తుసమదాయమంతయు, ఇచటసమృద్ధిగ దొరకును. కావుననే కవీంద్రచంద్రుడగు బకించంద్రమహాకవి "సుజలాం, సుఫలాం, సస్యశ్యామలాం, మాతరం, వందే" యని, జోహారుచేసినాడు.

హిందూదేశము చాలాగొప్పదిగానున్నను, హిందూదేశీయులు ఐక్యతగలవారనుట కెట్టిసందేహమునులేదు. మన విరోధులు, కొందరు హిందువులలోఐకమత్యముకుదురుటదుర్లభమని చెప్పినంతనే, "అదిగోపులి అంటే, తోకత్రొంగిచూడ్ల" న్నచామెతగా మనవారుదానినినమ్మి, హనుమంతుడు సీతాన్వేషణార్థమయి లంకకుపోదలచి, సముద్రమునుదాటుటకు శక్తికలిగియుండియుకూడ, తనశక్తివిషయము తెల్పువరకు మోహములోబడి పరితపించినరీతిగ; మనమునిజముగ ఐకమత్యముకలిగి అనేకగొప్పసామ్రాజ్యములు స్థాపించి, సర్వతోముఖముగ యభివృద్ధిపొందియుండి, ఈనాడుఇతరులమాటలనమ్మి శక్తిహీనులము, ఐకమత్యములేనివారమనితలచియుండుటకన్న వెఱ్ఱియేమికలదు? ఆసేతుహిమాచలము ప్రతిభారతీయుడును, ఒకేదే

వభాషగలవారై, ఒకేవిధమైన మతమునకులోబడి, ఒకేవిధమైన ఆచారవ్యవహారములుకలవారై, తోడిభారతీయులపూజించు రామకృష్ణాద్యవతారములనే, తాముబూజించుచు, తోడిభారతీయులకన్న తాము వేరనిచెప్పుటకు సాహసింతురా? వింధ్యపర్వతమునకు దక్షిణమునవుండు మనము కాశీ, ద్వారకా, జగన్నాథ క్షేత్రములకుపోయి, అచ్చట వేంచేసియుండు పరమేశ్వరుని సందర్శించి, పునీతులముగావలెనని, ఎట్లుపరితపించుచుందుమో, అటులే వారుకూడ, మనదక్షిణదేశమునందుండు పుణ్యక్షేత్ర దర్శనకుతూహలులైయున్నారనుట కేమాత్రమైన సందేహముకలదా? అనుదినముస్నానముచేయునపుడు భారతీయుల ఐక్యతాచిహ్నమగు భారతదేశసర్వనదీ సంస్మరణ చేయుటా చారముకదా? ఒకనాగరకత, ఒకభాష, ఒకమతము, ఒకవిధమైన ఆచారవ్యవహారములు, అందరికి సమానమైనపుణ్యస్థలములు, ఇన్నికలిగియుండియుకూడ, భారతీయులలో ఐకమత్యము కుదరదనుట, కేవలపరిహాసాస్పదముగాదా? ఇదిమనబానిసత్వమును అపేక్షించి తద్వారా తాములాభముబొందుటకై మనకొరులు నేర్పినవిద్యగాని వేరుకాదు. మనపూర్వులు ఐకమత్యము కలిగియుండుటబట్టియే హిందూదేశము ప్రపంచములో నున్నతస్థానమలంకరించియుండెను.

భారతదేశము, ౧౧వ శతాబ్దమువరకును, హిందూరాజులవశము ననేయుండెను. భారతయుద్ధానంతరమునుండి ౧౧వ శతాబ్దమువరకు హిందూసామ్రాజ్యమును పరిపాలించినవారి

లో, చంద్రగుప్తమౌర్యుడు, అశోకుడు, గుప్తరాజులు, హర్ష
డు మొదలైనవారుముఖ్యులు. వీరు తమకాలములలోవచ్చిన
పరదేశీయులను బారద్రోలి హైందవస్వాతంత్ర్య పతాకమును
నిలుపబెట్టిరి. వీరికాలములో హిందూదేశము,వస్తుసంపదలచేత
తులదూగుచుండెను. వీరుఅనేకదేవాలయములు చెరువులుక
ట్టించి ప్రజాప్రేమకు పాత్రులైరి. విద్యనుబోషించిరి. వ్యవసా
య వాణిజ్యములకువలయు సౌకర్యములేర్పరచిరి. న్యాయప
రిపాలనయందు హిందూరాజులను మించినవారులేరని వేరుగ
జెప్పవలెనా? ఈనాటికిగూడ మనము విక్రమార్కుని న్యాయ
పరిశీలనమును గురించినకథలను చదువుచునేయున్నాము గదా!
హిందూరాజులు పాపభీతిగలవారై, న్యాయమార్గము తప్పరై
రి. ప్రజాక్షేమమునకై పాటుబడిరి.

చంద్రగుప్తునికాలమున పరిపాలనావిధానము సక్రమ
మైనపద్ధతులమీద చాణుక్యునిచే ఏర్పరుపబడెను. గుప్తసా
మ్రాజ్యములో వాణిజ్యము చాలనున్నతస్థితియందుండెననుట
కు మనదేశీయులు రోముసామ్రాజ్యమునకుబోయి అచటనీవ
స్తువులనమ్మి విశేషధనమును మనదేశమునకు గొనివచ్చుచుం
డిరనుటయే దృష్టాంతము.

ఏకఛ్ఛత్రాధిపత్యముతో హిందూదేశము నేలినను,
హిందూరాజులు ప్రజాకంటకులుగనుండుటకు సాహసింపలేదు.
ధర్మనీతిమార్గ ప్రవర్తనులై, తాముచేయుప్రతికార్యమునకు, భ
గవంతునికి తాముత్తరవాదులమనెడి భయముచే, ప్రజాపీడనము

నకు ఏనాటికినికూడ పూనినవారు కారు. రాజు ప్రజాశరీర ము. శరీరము ఏవిధముగనొచ్చినను ప్రాణమునకు నొప్పికలుగ కమానదుకదా? కావున అనాదినుండి, వంశపరంపరగావచ్చిన యీనీతినివిడనాడి, స్వతంత్రించి, ధర్మబాహ్యులై ప్రవర్తించి న నరపతులు, హైందవఇతిహాసమున నరుదు. ఏవో యొకట్రెండు వేనునివంటి రాజులుఅవతరించినను, ధర్మస్వరూపమును చక్క గాకాపాడుచుండిన, ఆనాటికాలపుద్విజులు, అటువంటిరాజుల ను పదచ్యుతులచేయుటకు వెనుదీయరైరి. కావుననే, హైందవ రాజులు నిరంకుశులుగ ప్రవర్తించుటకు వీలులేకపోయినది.— “నావిష్ణుః పృథివీపతి”యని ధర్మస్వరూపుడగు రాజునుమన వారు భావించినదినిజమే. కానిఇయ్యదిదుర్మార్గులగు రాజులప ట్లచెల్లినదికాదు. ఇటీవలివారలగు, చంద్రగుప్త, హర్ష పులకే శిమొదలగు చక్రవర్తులచరిత్రలలోకూడ, వారినిరంకుశత్వమె చ్చటను గానరాదు. కావున, కొందరుచెప్పునటుల మనమెప్పు టికిని, నిరంకుశపరిపాలనకు లోబడినవారముకాని, ప్రజాప్రభు త్వమెట్టిదో ఎఱుగనివారముకాని కాము.

కాని ఈహైందవస్వాతంత్ర్యపతాకము చాలాకాలము నిలిచినదికాదు. ౧౧౯౩వ సంవత్సరమునస్థానేశ్వర యుద్ధము న, పృథ్వీరాజును,అతనిఅనుచరులను చంపబడుటచే,పవిత్రమై న ఈఆర్యభూమి మహమ్మదీయులస్వాధీనమాయెను. స్థానేశ్వర యుద్ధమునగెలిచిన మహమ్మద్ గోరియనుతురుష్కుడు, ఢిల్లీసం స్థానాధీశ్వరుడైనపృథ్వీరాజుచేత 7సార్లుయుద్ధములో పరాభ

విడువబడి, ప్రాణదాన మొందినవాడు. శరణాగతత్రాణ రక్షణము నెడియార్యధర్మ మడ్డురాకుండి యుండినచో, మహమ్మదీయప్రభుత్వస్థాపనకు కారణభూతుడైన యీమహమ్మద్ గోరియేనాడో పృథ్వీరాజుచే అసువులబోగొట్టుకొనియుండి యుండును. కాని ఈశ్వరేచ్ఛ వేరువిధముగనుండబట్టియే, పృథ్వీరాజు 7సార్లు తనచే ప్రాణదానమొందినవానిచే, తానునిహతుడు కావలసి వచ్చెను.

కాని స్థానేశ్వర యుద్ధమునందైనను మహమ్మదుగోరీ జయము నొందుటకు అతనిశక్తి సామర్థ్యము లంతకారణములు గావు. సామ్రాజ్యాధిపత్యపదవికై తమలో పృథ్వీరాజు జయచంద్రులు పోరాడిరి. జయచంద్రుడు పరాభూతుడై, కినుకవహించి, తుదకు, సర్వలక్షణోపేతయగు హైందవమాతను మహమ్మదీయుల పాలు జేయసమకట్టి, మహమ్మదుగోరీని ఆహ్వానించి, అతనికి పృథ్వీరాజులోపములు తెలియపరచి, నిద్రావశులైయుండిన పృథ్వీరాజుసైనికులమీద, అర్థరాత్రిలో వచ్చిపడి మహమ్మదుగోరీ విజయుడగునట్లు చేసెను. తుదకు ఈమాతృద్రోహియగు జయచంద్రునిగూడ గోరి విడచెనా? దూరదృష్టికలవాడుకావుననే, ఈద్రోహినిగూడ మరుసటిసంవత్సరము యుద్ధములో నోడించెను. తుదకు జయచంద్రుడు పశ్చాత్తప్తుడై గంగలో బడి ప్రాణములువదలుకొనియె. ఆనాడుమొదలుకొని, ఈనాటివరకును, హైందవమాత పతితావస్థలో నున్నది.

స్థానేశ్వర యుద్ధమైనది మొదలుకొని ౧౧౯౨వరకును

మహమ్మదీయుల పతాకము ఢిల్లీపరిసరప్రదేశముల అవిచ్ఛిన్నముగ విహరించుచుండెననియె జెప్పవచ్చును. "కానిమహమ్మదీయులు హిందూదేశమంతయు నెప్పుడును జయింపలేదు. గొప్పరాజ్యములను హిందూరాజులేయెల్లప్పుడు నేలుచుండిరి.

* * * * * *

మరాటావారు హిందూదేశమునందంతటను దురుష్కరాజులు దమకు కప్పములుగట్టునట్లుగా జేయుచుండిరి. ప్రస్తుతము మనమూహ జేయగలిగినంత వరకుజూడగా నింగ్లీషువారి (19వ శతాబ్దము) శతాబ్దప్రారంభమున నడ్డపడియుండనెడల మొగలరాజ్యము హిందువులస్వాధీనమైయుండును." మొదటిమున్నూరుసంవత్సరములు పఠాను మహమ్మదీయులు ఢిల్లీలో రాజ్యముచేసిరి. వీరికాలములో నిరంతరము యుద్ధముజరుగుచుండెననియే జెప్పవచ్చును. ప్రజలకేమాత్రము సౌఖ్యము లేదు. వీరిలోవకరిద్దరుతప్ప మిగతరాజులందరు హిందువులను ద్వేషించువారే. అయినను హిందువులుమాత్రం తమమతమును వదలలేదు. వారికిగల పరమతసహిష్ణుతవలన, హిందూమహమ్మదీయ సఖ్యమేర్పడుటకవకాశముగలిగెను.

పఠానువంశజులనోడించి మొగలాయిశాఖకుచేరిన బాబరు ఢిల్లీలోప్రభుత్వమునుచేయప్రారంభించెను. ఈతనిమనుమడే కీర్తికాముడగు అక్బరుచక్రవర్తి. వీరు౧౫౫౬ మొదలుకొని ౧౭౦౭వరకు అడ్డులేక రాజ్యపరిపాలనగావించిరి. ౧౭౦౭లో ఔరంగజేబు మృతినొందెను. అతనితరువాతివారు చాలాబలహీ

నులగుటచే త్వరలో మొగల్ సామ్రాజ్యము క్షీణించెను. మొగలాయిప్రభువులలో పేర్కొనబడినవారు అక్బర్, ఆతనితరువాతివారలగు జహాంగీరుషాజిహానులు. అక్బర్, మొగల్ సామ్రాజ్యమునువిస్తరింపజేయుటయేగాక, సుస్థిరమగునేర్పాట్లు గావించెను. ఇతనికాలములోనే భూమియంతయు కొలవబడి, సక్రమమైనపద్ధతులమీద పన్నువసూలుజేయుట ఏర్పడినది.

మొగలాయిప్రభువులు హిందూమతద్వేషము మాని, హిందువులతోసఖ్యతను వృద్ధిచేసిరి. హిందువులకు గొప్పగొప్పయుద్యోగము లొసగి, వారికిమహమ్మదీయులకొట్టివేసము నుజూపరైరి. వీరికాలమున హిందూదేశము సర్వవిధముల యభివృద్ధిబొందెను. ఒకభూమిపన్నుతప్ప మిగతపన్నులన్ని యెత్తివేయబడెను. ఎచటజూచినను మంచిపంటలుపండుచుండెను. ఆకాలమున పైసకుసేరుచొప్పున బియ్యమిచ్చుచుండిరట వాణిజ్యముకూడ యభివృద్ధిగాంచెను. "కాశ్మీరశాలుపలు, ఢాకామల్లులు, బందరుటద్దకపుచీట్లు, బనారస్ పట్టుబట్టలు మొదలైనసరకులు కోట్లకొలది ప్రతిసంవత్సరము యూరపుదేశము నకుబోవుచు నాధనమంతయు హిందూదేశమునకు వచ్చుచుండెను" పరదేశములనకు ధనముబోకుండ నష్టగింపబడెను. ఈవిధముగ ప్రజలుస్వాతంత్రహీనులయ్యు, మిక్కిలిసౌఖ్యములనుభవించిరి.

ఈమొగల్ సామ్రాజ్యము క్షీణించుటకు ఔరంగజేబే కారకుడు. ఇతని అన్యమతద్వేషము, కపటము, తననేతానున

మ్మలేకపోవుట మొదలగుదుర్గుణములచే, ఇదివరకు మొగల సామ్రాజ్యమునకు పట్టుగొమ్మలుగనుండిన హిందూరాజులు తిరుగబడునట్లుచేసుకొనెను. అందులో మహారాష్ట్రులు ముఖ్యుందులు. మహారాష్ట్రులను, ఒకటిగజేచేసి, వారిలోనుండిన శౌర్యప్రతాపాగ్నిని రగుల్కొల్పజేసి స్వజాతిస్వధర్మాభిమానములను పెంపొందించి, మహారాష్ట్రరాజ్యమునేగాక, హిందూసామ్రాజ్యమునే స్థాపించునంతటి శక్తిసామర్థ్యములను కలుగజేసినట్టివాడు శివాజీ. అతనితల్లి జిజీబాయి ఇతడు బాలుడుగనుండినప్పటినుంచి, రామాయణభారతాదుల కథలజెప్పి, స్వధర్మస్వరాజ్యకాంక్షను పోషించెను. తరువాత ఇతనిగురువగు రామదాసు, స్వధర్మస్వరాజ్యాశయములను, నినుమడింపజేసి పవిత్రమగు స్వధర్మరక్షణకై పరరాజులవిధ్వంసమావశ్యకమని తేటపరిచెను. తనతోపాటికొంతమంది యువకులను జేర్చుకొని అంఖండసామ్రాజ్యయుతులును, నిఖిలబలోపేతులునగు మొగల్‌సామ్రాట్టుమీద కత్తిగట్టి, పోరి, జయించి, మహారాష్ట్రరాజ్యమును స్థాపించి, స్వామి రామదాసులవారి యధీనముచేసెను. శివాజీత్యాగశీలమునకును, ధర్మబుద్ధికిని సంతసించి, తనపరముగా హిందూధర్మరక్షణార్థము రాజ్యముచేయవలసినదిగ శివాజీకిమరల రామదాసుసామ్రాజ్యమునొసగెను. శివాజిచాలకాలము ఇక్కార్యమునునెరవేర్చుటకు ఈశ్వరుండవకాశమొసగలేదు. అతడు అనతికాలములోనే ఈశ్వరసాన్నిధ్యముచేరెను. కానిఅతడునాటిన స్వధర్మస్వరాజ్యబీజములు అంకురించి,

గొప్పవృత్తుమై,తుదకుఢిల్లీసామ్రాజ్యాధిపతియగు మొగల్ చక్ర వర్తినిగూడ పరాభవించి, హిందూస్వాతంత్ర్యపతాకమును మరలఢిల్లీలో నెలకొల్పునంత చేసెను. మహారాష్ట్రులు, మహారాష్ట్రరాజ్యసంస్థాపనతో తృప్తిబొందక సుమారు ౧౦౦సంవత్సరములుగ హైందవభూమిని స్వాధీనపరచికొని, హైందవమతచిహ్నములగు దేవాలయముల నాశనముచేసి, అనేకమందిహిందువుల చిత్రహింసలుగావించిన మహమ్మదీయ ప్రభుత్వమును తుదముట్టజేసి, అఖండహిందూసామ్రాజ్యమును స్థాపింపసమకట్టిరి. జీర్ణమగుచుండిన హిందూమతమును కాపాడదీక్షబూనిరి. హైందవస్వాతంత్ర్యపతాకమును, హైందవభూమిలో అవిచ్ఛిన్నముగ విహరింపజేయ కంకణబద్ధులైరి. పూనా మొదలుకొని పంజాబువరకును, సింధూనది మొదలుకొని బంగాళావరకును, ద్రవిడకొంకణదేశములలోకూడ, మహారాష్ట్రులు తమరాజ్యమును విస్తరింపజేసిరి. హిందూదేవాలయములను పునరుద్ధరించిరి. హిందూధర్మములను నిలుపబెట్టిరి. సంస్కృతభాషను పోషించిరి. హిందూపద్ధతులమీద రాజ్యపరిపాలనగావించిరి. ప్రజల సర్వసౌఖ్యముల ననుభవింపజేసిరి.

కాని,మహారాష్ట్రులు స్వధర్మ,స్వదేశప్రేరితులై స్వల్పకాలముననే, గొప్పహైందవ సామ్రాజ్యమును స్థాపించినను, హైందవప్రజాపారతంత్ర్యమునకు కారణభూతములగు కొన్నిలోపములకు వారునుగూడ దూరులుకాలేదు: ఇవియే, అసూయ, స్వార్థపరత్వములు. ఏకారణముచేత ౧౧౯౩లో జయచంద్రు

డు, తనబంధువును హిందూధర్మరక్షణపరతంత్రుడునైన, పృథ్వీరాజును, మహమ్మదుగోరీకి సాయముచేసి, పరాభవింపచేసెనో అదేకారణముచేతనే, రెండవబాజీరాయుడు మహారాష్ట్రరాజ్యమును ఆంగ్లేయులకమ్ముకొనుట కిచ్చగించెను. అంతటితో హైందవసామ్రాజ్యమును హైందవస్వాతంత్ర్యజీవనము అడుగంటెను.

౨

భారతదేశము నిరుపమానమైనది. ప్రకృతిసౌందర్యముచేతనేమి, వివిధమగు వస్తుబాహుళ్యముచేతనేమి, తాత్త్వికప్రపంచమందుగనుపించియు గనుపింపని యున్నతస్థలముల సంచరింపగల బుద్ధినిశితత్వముచేతనేమి, సర్వకళాకౌశలముచేతనేమి, ప్రజలనుసుఖులనుగానేల గలిగినపాలనా దక్షతచేతనేమి, యసమానమై, యీయన్నివిషయముల దక్షిణప్రపంచమునకు గురుత్వమును వహించివెలసినది భారతదేశము. భూమికిరత్నగర్భయను పేరునుసార్థకము జేసినదిభారతదేశము. దేశమందలిప్రజలు నడుచుటకువేసినబండలు బంగారపువని ఖ్యాతినిగడించినదియు, పవిత్రతాస్వరూపులగు స్త్రీపురుషులకు నెలవనిపేరుమోసినదియు భారతభూమియే.

అన్నియునటుండనిచ్చి భారతదేశమందలి ద్రవ్యము వస్తుసమదాయము విదేశీయులగన్నులనెఱ్ఱజేసినవి. మహమ్మద్ ఘజినీ గోరీ, నాదర్ షా మొదలగు మహమ్మదీయులు ద్రవ్యవిశేషమునందలి ఈమోహముచేతనే పలుమారులు దండయా

త్రలు సాగించి ఒంటెలపై గాడిదలపై నపారధనమును, దేశము వెలుపలికి ద్రోలిరి. చాలాకాలమునుండి పాశ్చాత్యులకు, ప్రస్తుతసందర్భమున ఐరోపావాసులకు, భారతదేశముయొక్క ద్రవ్యసంపత్తిచే బంగ్లపులిసిపోవుచుండెననుటకు పెక్కి మొదలగు సుహాకవుల వ్రాతలు నిదర్శనములు. కానియిదివారికందనిపండై యుండినది. పాశ్చాత్యులీదేశమున కెట్లువచ్చిరో, యెచ్చటెచ్చటకాపురముచేసిరో, బేరసారములెట్లెట్లుసాగించిరో, తిన్నయింటివాసములలెక్కించుట కెట్లారంభించిరో, గొల్లదుగొట్టిలజాపు సత్యముసెట్లు తమపరివర్తనమున బ్రకటించిరో బందిపోటుకళల నచ్చటచ్చట నెట్లుమెఱయించిరో చరిత్రజ్ఞానముగల ప్రతియొక్కరికి కొంచెముగనో గొప్పగనో తెలిసియేయున్నను, నట్టిమెరుక లేనివారికి గొంతసంగ్రహముగ వ్రాయవలసియున్నది.

ఐరోపాఖండమున పోర్చుగల్ అనునొక చిన్నదేశము కలదు. అదిమనఒకజిల్లాకంటె పెద్దదికాదు. మనభారతదేశమునకు మార్గమును మొట్టమొదటకనుపెట్టిన వారాదేశమువారే. ఈదేశమునుచూచినంతనే వారికాశ్చర్యముకలిగినది. వారనుకొనియుండినట్లు పెకలించుకొనిపోవుట కిచ్చటబంగారుకొండలు కనుపించినవికావు. వృత్తులననుసరించి పాటుబడిన లాభముస్వపనిమాత్రము గ్రహించిరి. పోర్చుగీసువారి యోడలువచ్చెను. మలబారుతీరమునదిగెను. మొదట మొదట చిన్నచిన్నరాజులనండియు దర్వాతచక్రవర్తినుండియు గొన్నిస్థలములుసా

కర్యములు సంపాదించుకొని వ్యాపారముజేయుచుండిరి. వీరు లాభములందుచుండిన పొరుగువారు గ్రుక్కిళ్లుమ్రింగుచు నూరకుందురా? డచ్చిజాతివారును దమదృష్టి నిండియావైపు బారించిరి. వారు హాలెండుదేశమువారు. డచ్చివారు పోర్చుగీసువారిని సూరత్ నుండి దరుమగొట్టిరి. ఆర్మజ్ అని గోవాఅని మఱిరెండు స్థలములుగూడ సంపాదించిరి. పరాసువారు వాంగ్లేయులుకూడవచ్చిరి. పరాసువారుకూడ గొన్నివ్యాపారస్థలముల నేర్పరచుకొనిరి.

ఇంగ్లాండులో ఎలిజబెత్ రాణీ రాజ్యముచేయు నపుడాయమ యనుమతినిబొంది భారతదేశముతో వ్యాపారముచేయుటకై యొకసంఘమునేర్పరచిరి. ఆసంఘముపేరు తూర్పు ఇండియాసంఘము. భారతదేశమున జహాంగీర్ చక్రవర్తిరాజ్యముచేయుకాలమున వారియుత్తరువుపొంది సూరత్, క్యాంబే,అహమ్మదాబాదులలో తొలుతను, ౧౬౧౬లో కల్లికోట మచిలీపట్టణములలోను, ౧౬౩౯లో చెన్నపురిలోను, నివాసముతేర్పఱచుకొని వ్యాపారములు చేయుట కనుజ్ఞలనంది యట్లుచేసిరి. తమమనుష్యులునేరములుచేసినయెడల తామేవిచారించి శిక్షచెప్పుకొనురాజాధికారమునొకదానిని ౧౬[illegible]సంవత్సరమున సంపాదించిరి. తామువ్యాపారముచేయుస్థములలో మఱెవ్వరు చేయగూడదని వారినిశ్చయము. అట్లువ్యాపారముచేసినవారిని చిక్కినపట్టుకొనితన్ని వస్తువులగుంజుకొనుచుండిరి. చిక్కనివేళలలో నూరకమిడుకుచుండిరి. డచ్చివారు

తమకంటె తక్కువధరలకమ్మెదరని కుంఫిణీ (తూర్పుయిండి యా సంఘము)వారు గోలబెట్టుచుండిరి. కుంఫిణీవారు డచ్చి వారిపై దారుణకృత్యములజేసిరని వీరువారినంబాయనాలో కుత్తికలుకోసిరి.

ఈలోపరాసువారు మాత్రమూరకుండలేదు. అచ్చట చ్చట నివాసములనేర్పఱచుకొనివారును వ్యాపారములుచేయు చునేయుండిరి. అంతేకాదు. కుంభిణీవారితో డచ్చివారివెనుకవీ రే ప్రబలముగబోరాడిన ఐరోపీయజాతి. దక్షిణమునగల హిందూమహాసముద్రమునందలి దీవిగడ్డలతో వ్యాపారమునుఱిగి డచ్చివారు కుంభిణీవారిజోలికి తర్వాతరాలేదు.

కుంభిణీవారుదేశమున కాలుబెట్టిన ముహూర్తముమంచిది. దేశముయొక్క ఐక్యతకుచిహ్నమగు చక్రవర్తిత్వము బేబర్ అక్బర్ మొదలగు బలవంతులను దాటి బలహీనపుజేతులలోపడినది. జహంగీరంతఃపురప్రియుడు. భోగలోలుడు. వ్యసనాసక్తుడు. దేశపాలనమందు శ్రద్ధలేనివాడు. వివిధప్రాంతములనుండిన రాజప్రతినిధులు రాజులుస్వతంత్రులుకాజొచ్చిరి. వివిధభాగములకు బరస్పరముగల కట్టుబాటులు సడలజొచ్చెను. విదేశమునుండి వచ్చిన పోర్చుగీసువారుగూడ భారతచక్రవర్తికి చిఱుపుబుట్టించువారైరి. వారినడచుటకు కుంభిణీవారు సహాయింపవలసిన వారైరి. కాని ఔరంగజేబు జహంగీరువంటివాడుకాడు. పాలనాదక్షుడు. బలవంతుడు. మనోనిశ్చయము పట్టుదలకలవాడు. ఆడంబరములేనివాడు. స్వకాయకష్టముచే

జీవించువాడు. అతనికాలమున ధర్మసామ్రాజ్యము మఱలబల పడి యుండవలసినదే. కానియతడు అన్యమతద్వేషి. హింసా ప్రజాపీడకుడైన కారణమున ప్రజలుసామంతులునందఱు మనస్సులలో నొచ్చుకొనుచుండిరి. మొగల్ సామ్రాజ్యవినాశనమునకై యీశ్వరుని ప్రార్థించుచుండిరి. జనులెట్లుబాధపడుచుండెదరో, సామంతులయభిప్రాయము లెట్లుండెనో, తెలియవలయునచో రాజసింహుడు ఔరంగజేబునకు వ్రాసినయుత్తరముచూచిన చాలును.

ఇది కుంఫిణీవారుబలకొనుచుండిన ముహూర్తము.

౧౭వశతాబ్దాంతమున కలకత్తా గోవిందపురములున్నగు కొన్నిగ్రామములు బంగాళా సుబేదారునుంచి గుత్తకుతీసికొని యచ్చటకోటను గట్టిరి. ఉదారులగు భారతదేశప్రభువులప్పటికుపేక్షించిరి. కానికుంఫిణీవారు రాజకీయోద్దేశముతోనే కోటనుగట్టిరనుట యింగ్లాండునుండి ౧౬౮౭సంవత్సరమున వచ్చినయుత్తరమునుండియేస్పష్టము. "మనవ్యాపారమునెంత జాగరూకతతో బోషించుకొనవలెనో, మన(రివిన్యూ) కూడనంతే జాగరూకతతో వృద్ధిచేసుకొనవలెను. దురదృష్టవశమున వ్యాపారమునకరిష్టములు కలిగినపుడా రివిన్యూ మన సైన్యమును నిలువబెట్టవలెను. ఇతరులెవ్వరాక్షేపింపకుండినచోనే కాదు మఱిస్వశక్తిచేతనేమనకువ్యాపారముచేయవలెను". పిమ్మటకుంఫిణీ నౌకరులందఱీయుద్దేశమును మనస్సునందుంచుకొనియే ప్రవర్తించిరి. భారతప్రభువులకుమాత్ర మీసూచనలు తెలియనవని యూహించిన

కనుపింపకపోలేదు. ఒకసారిచక్రవర్తి కోపించి వీరినిసూరతునుం
డి వెడలగొట్టి, బొంబయినిపట్టుకొని, విశాఖపట్టణాది కర్మాగా
రముల వశపఱచుకొనెను. చిట్టగాంగునుబట్టిపోయితన్నలుది
నివచ్చి పాట్నకాశింబజారులోనున్న కర్మాగారముల గోల్పో
యిరి. ఆంగ్లేయులోడినందున భారతప్రభువులు తృప్తిజెందియు
పేక్షించి నిశ్శంకగ నిదురించిరి. ఆంగ్లేయులో క్రమెడలంత క
న్నులుగలిగి మెలగుచుండిరి.

పదునేడవశతాబ్దమునందే కుంభిణీవారిబలమునకు పునాదివేసి
కొనినది. బంగాళా, బేహారు, ఒరిస్సా, ప్రాంతములలోనే వారి
ప్రభుత్వము తొలుత స్థాపితమైనది. ఈదేశముఢిల్లీచక్రవర్తికిలో
బడి చక్రవర్తిప్రతినిధిగ సర్దారులు పరిపాలించుచుండిరి. ఢిల్లీప్ర
భువులు బలహీనులైనకారణమున బంగళాసరదారులు నామ
కార్థము ఢిల్లీయుత్తరువుపై కప్పముకట్టుచుండినను పాలనవ్యవ
హారములందు స్వతంత్రులై నవాబులైయుండిరి. వారిలోచేత
గానివారు కుంభిణీవారి యక్రమములకు తలలొగ్గగా, యట్టివి
సహింపక తిరుగబడి కుంభిణీవారితో యుద్ధములుచేసిననవాబు
లుకూడగలరు. కొన్నియెడల నవాబులు జయమొందిరి. అనే
కసారులోడిపోయిరి. ఓడిపోయినపుడెల్ల కొంచముకొంచముగ
కుంభిణీవారిచేతిలోనికధికారము జారుచువచ్చినది. అలీవర్దీఖా
నుకాలములో అమెరికావారి యోడలనుకొన్నిటిని, భారతీ
యులయోడలను గొన్నిటిని, పరాసువారివస్తువుల మోసికొని
పోవుచున్నారను మిషబెట్టి పట్టుకొనినపుడు, నవాబు కుంభిణీ

వారికి తీవ్రముగ వ్రాసి, ఖాసీంబజారులోని కర్మాగారమును పట్టికొని, ౧౦లక్షలరూపాయల దీసికొని విడిచిపుచ్చెను. అలీవర్దిమేనల్లుడు సురాజుద్దౌలా రాజ్యముచేయుకాలమున కలకత్తాయొద్ద కుంఫిణీవారు కోటగట్టుటను, నవాబుకోపించి యా కోటనువశముచేసికొని, కుంఫిణీవారినికొందఱను ఖయిదీలుగా పట్టుకొనెను. నవాబు వారినినొకస్థలవశముచేసిపోయెను. వారినుంచుటకుచాలినంతస్థలములేక గాలిరానియొకకొట్టులోనుంచిరట. ఉదయమునకు ౧౨౩గురుచచ్చి ౨౩గురుమాత్రము బ్రతికియుండిరట. దీనినే(Black Hole)అనగా, అంధకారబిలహత్యఅని ఆంగ్లేయులనుచున్నారు.

నవాబుపైపగదీర్చుకొనుటకు మదరాసునుండి సైన్యమువచ్చెను. ఆసైన్యమునకు క్లయివునాయకుడుగానుండెను. ఈయోధుడురంగమును ప్రవేశించినప్పటినుండియు భారతదేశమున కుంఫిణీవారిచరిత్రముమారినది. అతడు తనసైన్యముతో నబాబునోడించి యతనివలన కొన్నివ్యాపారసౌకర్యములు, యుద్ధపరిహారము, కోటగట్టుటకు సమ్మతిసంపాదించెను.

తమకుజోహారుచేయుచు చేతులుజోడించుకొని యుండని సురాజుద్దౌలాను పదభ్రష్టునిచేయవలెనని కుంఫిణీవారు దీర్ఘముగనాలోచించిరి. సురాజుద్దౌలాకు బంధువు, నతనిసైన్యమునకు నధిపతియగు మీర్జాఫర్ అనుసరదారునితో కుట్రబన్నిరి. అతడుతమవైపునకువచ్చిన నతనినవాబును చేసెదమని వాగ్దానముచెసిరి. సురాజుద్దౌలాపై లేనిపోనినేరముల

మోపి యుత్తరమువ్రాసి యాతనినుండి ప్రత్యుత్తరమునకు నిరీక్షింపక యే యతనిపైసమరమునకు నడచిరి. ఇరుసైన్యములకు సంకులసమరమయ్యెను. మంచితరుణమున మీర్ జాఫర్ తనసైన్యముతో కుంభిణీవారివైపునకు నడచి కుంభిణీవారికి జయము నొసగి, భారతదేశదాస్యమునకు బునాదివైచెను. మీర్జాఫర్ సింహాసనము నధిష్ఠించెను.

కుంభిణీవారికి నవాబ్ గిరీ యిచ్చుటకుతీసివేయుటకు నధికారముకలిగెను. వలసినంతద్రవ్యలాభముకలిగెను. మీర్జాఫర్ కోటిరూపాయల నుపాయనముగనిచ్చెను. కలకత్తాలోని యూరోపీయులకు నష్టపరిహారము, ౫౦లక్షలు, అర్మీనియన్ నివాసులకు ౨౧లక్షలు, సైన్యమునకు నౌకాదళమునకుబంచిపెట్టుటకు ౫౦ల. ౨౦వే. కుంభిణీకౌన్సిలులోని సభ్యులకు౧౨ లక్షలు, ౮౦వే. క్లయివునకుప్రత్యేకముగ ౧౬. ౨౦వే.లు సవరనులు. మూర్షిదాబాదు ఖజానాలోలేని కారణమున అంతఃపురములోని నగలమ్మియియ్యవలసి వచ్చెను. లంచములిచ్చి పదవిసంపాదించుకొనిన నవాబుపైప్రజలకు గౌరవములేకపోయెను. అయోధ్యనవాబు తెచ్చినదాడిని మళల్చినందుకు క్లయివునకు౨౭వేలసవరనులసంవత్సరాదాయముగల జహాగీరు నుదానమిచ్చెను.క్లయివుమాత్రముబలహీనుడగు మీర్జాఫరును తొలగించి రాజ్యముతమపాలనలోనికి తీసికొనిన బాగుండుననియే యింగ్లాండుకురహస్యముగ వ్రాసెను. కానియప్పుడేసమయము కాదని మీర్జాఫర్ నుతొలగించి యతనిమేనల్లుని

మీరాఖాసీమును సింహాసనమునునిల్పిరి. అతనిజీవితకాలమే యాపదవి యతనికి వాగ్దానము చేయబడియుండెను. అతనినుండి మూడుసారవంతమైనజిల్లాలు కొన్ని వ్యాపార సౌకర్యములునా గ్రహించిరి. మీరాఖాసిం మీరజాఫరువంటి బొమ్మ కానికారణము న, కుంభిణీవారికొసగినకొన్ని సౌకర్యముల వాడుకనుద్వినియోగించి తనదేశజనులకు కష్టముకలుగజేయుచుండ, తానుభరింపలేక వారికే సౌకర్యములనిచ్చి తనప్రజలకుగూడనట్టివియే యిచ్చెను. అదికుంభిణీవారుసహింపక మీరాకాసింను బక్సారుయుద్ధమున ౧౭౬౪లో నోడించి బంగాళము బిహారము, ఓఢ్రము మూటినివశపఱచుకొనిరి. ౧౭౬౩లో నేనుబలమీర్జాఫర్తో నతనిగద్దెపై గూర్చుండబెట్టు షరుత్తైనొకటియొడంబడిక జేసికొని యుండిరి. కుంభిణీవారికి వ్యతిరేకముగ మీరాకాసిం చేసియుండిన యేర్పాటులను కొట్టివేయుట, మఱికొన్ని వ్యాపారసౌకర్యములనిచ్చుట, కుంభిణీసైన్యముల తనజిల్లాలలో నిల్పుకొనుట, తనదర్బారు యెచ్చటనుండినను అచ్చట కుంభిణీవారి ప్రతినిధి నుంచుకొనుట. ఇవి క్రొత్త షరతులలో ముఖ్యమైనవి.

ఏర్పాటుమేరకు మీర్జాఫర్ నవాబయ్యెనుకాని, కుంభిణీవారియందు దపటమ్మకముగలిగి యిప్పటియొడంబడికను వంశపారంపర్యముగ జరుపునట్లు వారిమూలకముగ యింగ్లాండులోని డైరక్టర్లకు, రాజునకుగూడ వ్రాయవలెననికోరెను. కాని ఈషరతులను మీర్జాఫర్ మరణానంతరము గుర్తింపబడవలెనని సెక్రటరీ ఆఫ్ స్టేటుగారు కలకత్తాకౌన్సిలుకు రహస్యముగా వ్రాసిరి

కుంభిణీవారిఅతిచారములు అయోధ్యనవాబునకు చక్రవర్తి షాఆలమ్‌గారికి దుర్భరములైనవి. అయోధ్యనవాబు, కుంభిణీవారు వ్యాపారముమాత్రము చేసికొనవలయుననియు, రాజకీయములలోనికిదిగగూడదనియు,తమవారినందఱను మూటముల్లెకట్టి తమదేశమునకు బంపవలెననియు వ్రాసిరి. షాఆలమ్ దండెత్తియే వచ్చెను. చిన్న చిన్న పోరాటములు జరిగి కుంభిణీవారుజయమొందిరి. అప్పటియొడంబడికలో, అయోధ్యనవాబు తన్నాశ్రయించియుండిన మీర్ ఖాసీంను తరుమగొట్టునట్లంగీకరింపబడెను. అయోధ్యనవాబు అలహాబాదు కోరాజిల్లాలు చక్రవర్తికిచ్చునట్లుచేయించి కుంభిణీవారు చక్రవర్తిని వలలో వేసికొనిరి.

౬

బంగాళాప్రాంతమందలి జనులకు కుంభిణీవారు చేయు బాధలు దుర్భరములయ్యెను. చక్రవర్తియుశక్తుడై యూరకుండెను. ఇక బంగాళా నవాబు కలడనుకొందమా అతడువారిచేతిలోనిబొమ్మ. వారికివ్యతిరేకముగ వ్రేలెత్తిన తనపదవియూడును. ప్రజలెవ్వరితో మొఱలిడుకొనవలెను? ఇంగ్లాండునందుకుబనికిరాక బడిదిరుగువారు, వ్యాపారముచేసి దివాలుతీసినవారు,మఱియనేకవిధముల భగ్నమనోరథులైన వారందఱు, అదనువేచిభారతదేశమునకువచ్చి, మఱలయింగ్లాండునకు బోవునప్పటికి లక్షాధికారులగుచుండిరి. భారతదేశమందలి జనుల ననేకవిధముల పీల్చిపిప్పిచేసికొనిచనిన ద్రవ్యముచే వారుభూములను జ

హాగీరులనుకొని పార్లమెంటులో సభ్యులగుచుండిరి.

పీడితులగుజనులు మొఱపెట్టుకొనలేక పోయినను, కలకత్తాకౌన్సిలులోని సభ్యులే తమలో తామువాదులాడి యింగ్లాండులో గందరగోళముచేసిరి. ఆగందరగోళమునకు ఫలితముగ కార్యములుచక్కబెట్టుటకై క్లయివునుమరల భారతదేశమునకు బంపిరి.

అయోధ్యనవాబుతో, అలహాబాదు కోరాజిల్లాలు షాఆలమ్‌కు నిప్పించిన యొడంబడికసంగతి మనమిదివరకేచూచితిమి.క్లయివే యీయొడంబడిక జేయించినది.ఆసమయముననే చక్రవర్తియగు షాఆలంతోకూడ ప్రత్యేకముగ నొకయొడంబడికచేసుకొనెను. చక్రవర్తికుంభిణీవారికి బంగాళము, బీహారము, ఒరిస్సాయను నీమూటిపైన దివానీనిచ్చెను. అనగాపన్నులువసూలుచేసి వినియోగించునధికారము. చాలునకు ౨౬లక్షలు చక్రవర్తికప్పముచెల్లింపవలెను. ఆమూడురాష్ట్రములకు పరిపాలకుడుగానుండు నవాబునకు ఖర్చునకుగావలసిన ద్రవ్యమంతయు కొఱవలేకుండనిచ్చి మిగిలినది కుంభిణీవారనుభవింపవలెను. పిమ్మటకుంభిణీవారు బంగాళానవాబుతోనే తనకిచ్చుమొత్తము ౫౩లక్షలని యొడంబడిక జేసికొనిరి. ఈ౫౩లక్షలను క్రమముగ తగ్గించి చివరకు పరిపాలనమునే వశముచేసికొనిరికదా!

బంగాళాప్రాంతములదివానీ కుంభిణీవారు సంపాదించిరని ఇంగ్లండులోని పార్లమెంటునకాశజనించెను. ఆవిషయమై

తీవ్రమైన చర్చ జరిగెను. భారతదేశవ్యవహారములు ప్రభుత్వము వారిచేతిక్రిందికి దీసికొనవలయునని యుద్దేశింపబడెను. కుంభిణీ స్థితిగతులు విచారించి నివేదించుటకొక యుపసంఘమును నియమింపవలెనను తీర్మానముప్రతిపాదింపబడెను. ఆయుపసంఘము పనికుపక్రమించి యుపక్రమింపకముందే కుంభిణీదైరక్టరులు చేరి వాటాదారులకు ౧౦౦కి౧౨౨ లాభముపంచిపెట్టవలెనని తీర్మానించిరి. పార్లమెంటువారికీచర్య కోపకారణమై యాతీర్మానములను దమకు బంపవలసినదిగా కుంభిణీవారినికోరిరి. వారు జేసినదిసబబుగలేదని మఱల సంవత్సరమునకు నాల్గులక్షలసవరనులైననువాటాదారులకు పంచిపెట్టవలెనని తీర్మానించిరి. పార్లమెంటువారీచర్యనంతను రద్దుచేసి వాటాదారులకు నూటికి ౧౦కంటెపంచిపెట్టరాదనియు ఇంగ్లాండు ప్రభుత్వపుబొక్కసమునకు చాలుకు రలక్షల సవరనులియ్య వలయుననియు తీర్మానించిరి.

ఒకవ్యాపారసంఘమునుండి సంవత్సరమునకు రలక్షల సవరనులు దీసికొననిశ్చయించిన ప్రభుత్వపుకేమనవలయునోతోచకున్నది. కుంభిణీవారీదవ్యమంత యు జనులనుబాధించి గాక దా తేవలసినది? మొదలేప్రజాపీడకులనిపించుకొనినవారికనెంతటిరాక్షసులు కావలయునో! ఇదివరకే కఱ్ఱింగిపోవుచుండిన ప్రజలింక యేచావు చావవలయునో? అప్పటిదేశకాలస్థితులు కొంతగమనింపవలెను. వేయునవాబుది. పెత్తనము కుంభిణీ వారిది. విదేశీయులప్రభుత్వము పదిసంవత్సరములు జరి

గినతర్వాత చూడవలసియున్నది.

౧౮౬౫ సంవత్సరము వరిపంట బంగాళములో చాలకొంచముగానైనది. ఆసంవత్సరము వసూలుచేసినంత నిష్కర్షగా పన్నులనెప్పుడువసూలుచేసి యుండలేదు. ధరలు హెచ్చెను. బీదవారికి విత్తనపుగింజలుకూడ లేకపోయెను. ౧౮౬౬ సంవత్సరమున యెగుమతులు నిరాఘాటముగజరిగెను. వర్షము లమితములై జిల్లాలోపైరుచెడిపోయెను. గాలికాలములో పైరులెండవోచ్చెను. కలకత్తానుండి గవర్నర్ యీవిషయము ఇంగ్లాండుకు వ్రాయలేదు. ౧౮౬౬లో సందర్భవశమున కాప్టెయన్ అనునతడుమాత్రము, ఒకజిల్లాలోనిజనులుమాత్రము తిండిలేక బాధపడుచున్నారనియు, రివిన్యూమాత్రమేమియు తగ్గలేదనియు, వ్రాసిరి. ఆక్షామమిట్టులని చెప్పనలవికాదు. గింజలైపోయెను. విత్తనపుగింజలుకూడ ముగిసెను. పనిముట్లుమాయమైపోయెను. పశువులనమ్ముకొనిరి. పసిపిల్లలనమ్ముకొనిరి. తుదకు మనుష్యులను మనుష్యులే పీకికొనితినుటకూడ తటస్థించెనని. ఈసందర్భములలో నప్పటిప్రభుత్వమువారగు కుంఫిణీవారు చేసినదయాకలితములగు కార్యములేమి! పన్నులు [illegible] కూడ వసూలు చేయయత్నించుట. ఎగుమతులనాపుటకు యత్నించకుండుట. భారతజాతీయప్రభువు లిట్టిక్షామసందర్భములలో తమపా[illegible]యించి ధాన్యముచితముగ నిచ్చుచుండిరి. పన్నులబూర్తిగ త్రోసివేయుచుండిరి. ద్రవ్యము ఋణముగ నిచ్చుచుండిరి. కూలికి వారట్టిపనులేవియుచేయకుండుటేకాక, క్షామనివారణార్థ[illegible]

ప్పింపబడినదో సెడుధాన్యములో పిడికెడు కుంభిణీనౌకరు లపహరించిరట! మొత్తముపైఘోరమై, యించుమించు మూడవవంతు జనసంఖ్యనురూపుమాపి, యంతేప్రదేశము నరణ్యము జేసిన ఈక్షామపుబాధను తగ్గించుటకు కుంభిణీవారు వెచ్చించినద్రవ్యము ౨౦౦ వేలసవరనులకు మించుటలేదట. జమీన్దారులు తాలూకాదారులు తక్కుభూస్వాములెందరో ఈక్షామమున జాల పాల్పబడిరి. బీదలకుశక్తికిమించిన సాయముచేసిరి. ఋణములకై జమీనులనమ్ముకొనినవారుకొందఱు. గుత్తలుచెల్లింపలేక యాస్థివశపరచినవారుకొందఱు. కారాగారములపాలైనవారుకొందఱు. ఈసంధర్భములలోనే కుంబిణీనౌకర్లుకోటీశ్వరులగుచుండుట. కుంబిణీభాగస్వాములకు ౧౦౦కి ౧౨౨కావలెననుట, పార్లమెంటువారుబ్రిటీషుబొక్కసమునకు ౨లక్షలసవరనులుకావలెననిరి. ఔరామానవత్వము!!!

కుంభిణీప్రభుత్వమునకుపూర్వము పరిపాలించువంశములు మారినను పరిపాలనపద్ధతిమారలేదు. మొగలులు ప్రభుత్వమునకువచ్చిరి. ప్రజలనుబిడ్డలవలెపాలించిరి. హిందువులకు మహమ్మదీయులతోబాటు గౌరవోద్యోగములనిచ్చి సన్మానించిరి. అక్బర్ తావుననుండిన తోడర్ మాల్ మొదలగువారు హిందువులు. హైదరాలీమరణవార్తను దాచియుంచినమంత్రిలు బ్రాహ్మణులు, బంగాళానవాబు రేజాఖాం కుమారు, నందకుమారునే మంత్రిగాచేసికొన నిష్టపడెను. అంతెందుకు? హిందూమతపునరుద్ధరణమునకై కంకణమునుగట్టి మహమ్మదీయు

లపై దాడివెడలివారిని లొంగదీయుచుండిన మహారాష్ట్రసైన్య ములోని యొకసేనానాయకుడు మహమ్మదీయుడే. ఆనుపూర్వికముగవచ్చుచుండిన పన్నులపద్ధతిమారలేదు. భూస్వాములకును ప్రజలకు నుండినసంబంధము మారియుండలేదు. న్యాయవిచారణపద్ధతిమారియుండలేదు. ఏయూరికాయూరనే ప్రతివిషయమునకు బంచాయితులుండెడివి. ఆయూరివిషయము నాయూరివారియెదుట పెద్దలగువారు పరిష్కరించుచుండిరి. ఒకవేళకొన్నిపన్నులెక్కువగనుండెనేమో యనుకొన్నను, ఆపన్నులచ్చటనే తనసంఘముననే వినియోగింపబడుచుండెను. ౧౭౭౫లో కుంభిణీవారు కోర్టునేర్పాటుజేసిరి. తెల్లదొరలు కేసులు విచారించుట న్యాయముకనుగొనుట! ప్రజలనాశముజేయు నీకోర్టులరాకతో ప్రజాసుఖము సమకూర్చుచుండిన పంచాయితులుమూలబడెను. కలకత్తాలోయేర్పాటుచేయబడిన యీకోర్టున్యాయనిర్ణయమిక ముందు తెలిసికొనగలము.

౭

కుంభిణీవారిరాజ్యలాభములగొంతపరిశీలింతము. బంగాళాలో రాజ్యముచేయుచుండినమంత్రిని యతనిస్నేహితులను మిక్కిలి పలుకుబడికలవారను కారణముచే నైన్యముచేముట్టడించి ఖయిదుననుంచి, మైనర్ నవాబుకుపాలనకర్తగ నొకబేగముదానినుంచి యతనియందు జనులకగౌరవభావముకలిగించి, కడపట ౧౭౭౩లో రివిన్యూబోర్డుఅనునొకదానినేర్పరచి పరిపాలనములాగికొనిరి. పరాసువారితో తాముజేయుచుండినయుద్ధ

ములలో తనశక్తికిమించిన సాయముచేయ లేదని కాశీరాజును రాజ్యభ్రష్టునిచేసి, వీరిదౌష్ట్యముసహింపలేక తిరుగబడినప్రజల నాశముజేసి, యేయధికారములులేని ౧౫ సంవత్సరముల తోలుబొమ్మనొకనిని రాజునుజేసి కప్పము ౨౦లక్షలసవరనులజేసి వెడలిపోయిరి. ద్రవ్యముకావలసి అయోధ్యనవాబును కోరగా, తాముఅతనినెత్తికిగట్టియుండిన సైన్యపుకర్చులతో క్రుంగిపోవుచున్నాననియు ద్రవ్యములేదనియు దెల్పెను. అతనిఅవ్వయుతల్లియు ఫైజాబాదులోనుండిరి. వారితావున విశేషధనముగలదనివాడుక. కుంభిణీవారుఅయోధ్యనవాబును మాతృద్రోహియాగునట్లు, బోధించి, యతనితోజేరి బీగములపై కాశీరాజును తిరుగుబాటుకుప్రోత్సహించినట్లు నేరముపెట్టించి, అదాలత్ జడ్జిగానుండి న్యాయమును పడుపుపడతినిజేయుటకు వెనుదీయని ఇంపే యనువానిచే వారుదోషులైనట్లు తీర్పుచెప్పించి, బేగములమందిరముల ముట్టడించి వారికిగూడునీళ్లులేకుండజేసి వారిదాసీజనములపెట్టరానిబాధలుపెట్టి వారిద్రవ్యమంతటిని లాగుకొనిరి. నిరుపద్రవకరమై, శాంతిప్రియమై, స్వతంత్రతాకాంక్షకలిగి, ఐకమత్యముకలిగియుండిన రోహిలుల, ధీరులగురోహిలుల, అయోధ్యనవాబుతోజేరి నాశముజేసిరి. ఇంతజేయుటయెందుకు? ౨౦౦౦౦సవరనులు హేస్టింగ్సుజేబులలో, ౨౦లక్షలసవరనులు కుంభిణీవారిబొక్కసములో పోసికొనుట కొక్క జాతిని నాశముజేయుట! ఆర్కాటురాజ్యమును పిల్లిమీదమొలుకను యెలుకమీదపిల్లినివేసి యార్జించిరి. నైజామునకాస

జూపి, యదనుజూచికొని మహారాష్ట్రులతో జేరి, పరోపకార
పారీణతనునటించి హైదరును చిక్కులబెట్టిరి. టిప్పుసుల్తాను
కాలమున, తిరువాన్కూరుమహారాజుపై వీరికి పరమాంతఃకర
ణముగలిగి యతనిహక్కునునిలువబెట్టు మిషబెట్టి సగముమై
సూరు రాష్ట్రమును విభాగించి నైజామునకుకొంతయిచ్చి తా
ముకొంతతీసికొనిరి. బొంకి మోసముచేసి కొడగురాజ్యమును వ
శముచేసికొనిరి.కడపట మైసూరురాజ్యమును తమకులోబడిన
దానిగ జేసికొనిరి. మనస్సులోదిగమ్రింగుసుద్దేశము పెట్టుకొ
ని టిప్పుసుల్తానుతో మైత్రిని నటించినవిధమాశ్చర్యకరమైనది.
హింధూమతపునరుద్ధరణమునకై ఆసేతుహిమాచలము విజ
యఢంకామ్రోగించి రెండుసారులు ఢిల్లీపరిపాలనమే తనుచేతు
లలోనికి లాగికొనియుండిన మహారాష్ట్రులు బలహీనులగు తఱి
వేచి వారినిలొంగదీసిరి. లేనియధికారమువహించి మధ్యవర్తి
త్వమునడపబోయి న్యాయద్రోహులై సింధు అమీరులవలన
కొన్ని సౌకర్యములనుబొంది, పిమ్మట వారిపై లేనినేరముల ను
ద్దేశపూర్వకముగ నారోపింపజేసి, వారిమొడంబడికను యితర
మగునర్థముచెప్పి సింధు రాజ్యమునులాగికొని బ్రిటీషు రాష్ట్ర
మునకు జేర్చుకొనిరి. నిష్కారణముగ బంజాబును, బర్మాలో
ని పెగూను వశముచేసికొనిరి.

౮

నీతిదప్పినయెడల రాజ్యసంపాదనమున కనేకమార్గము
లున్నవి. తమసైన్యముల కూలికిబంపి సంపాదించినది కొంతభాగ

ము. గుత్తకని తీసికొనియాదరించిన స్వామినే యొలుకలద్రో సి లాగికొనవరి కొంతభాగము. హితులుగానటించుచుండి పంచ తంత్రములలో చాంద్రాయణవ్రతము చేయుచుండినమార్జాల మురీతి ననుసరించి గడించినది కొంతభాగము. క్లయివ్ ముర్షిదాబాదులోను ఢిల్లీయందును, హేస్టింగ్స్ కాశీలోను దక్కనునందును భృతసైన్యపద్ధతిని ప్రవేశపెట్టిరి. కాని వీరీపద్ధతిని విరివిగాగాని సక్రమమైనపద్ధతిపైగాని నిర్మింపలేదు. భృతసైన్యపద్ధతియనగ, నొకరాజ్యమున యారాజునకు సహాయార్థముగ బ్రిటిష్ వారిసైన్యమునుంచుట. ఆసైన్యపువ్యయము ఆరాజ్యమే భరింపవలెనను. ఆసైన్యమారాజుకొఱకేగాని బ్రిటీషువారియుత్తరువులననుసరించియే నడువవలెను. ఈపద్ధతిని వెలెస్లీగారువృద్ధిచేసి గట్టిపఱచిరి. ఆసైన్యపువ్యయమునకుగాను ఒకేవపాకొంతభూభాగము నుచితముగతీసికొనుట. ఇందుకుకారణములేకపోలేదు. ఈసైన్యపుకర్చులనే చాలునకుయియ్యలేక ఋణపడినైజామువలె భూఖండముల నీయవలసినవారుగూడ గలరు. ఈసైన్యముల బాకీలక్రిందలాగుకొనినభూమి కొంత. ఈసైన్యములుంచి తమకులోబఱచుకొనిన రాజ్యములుకొన్ని. ఇంతేకాదు, డాల్‌హౌసీగారు రాజ్యసంక్రమణ పద్ధతినొకదానిని కనుపెట్టి ప్రయోగించిరి. రాజుచనిపోయిన అతనివారసు దారు, కుమారుడో, సన్నిహితజ్ఞాతియో, లేకస్వీకృతపుత్రుడో యెవరో రాజ్యమునకు రావలసివచ్చినపుడు సామ్రాట్టుయొక్క అనుజ్ఞనుపొందవలసియుండును. అధికారవచిహ్నా

ముమాత్రమని తెలుసుకొనవలెను. హిందూశాస్త్రరీత్యాదత్తు
అంగీకరించి తీరవలసినదని యెల్లరకు తెలిసియేయున్నది. మన
మహమ్నన్ మొదలగు ధర్మశాస్త్రకారులకు డాల్ హౌసీగా ర
పార్థమును జెప్పసాగిరి. దత్తుచెల్లదనిరి. స్వమోట్టుఅంగీకరింపకు
న్న స్వీకృతపుత్రుడు వారసుకాడనిరి.ఇంగ్లాండులోని గవర్నమెం
టుకు డాల్ హౌసియిట్లు వ్రాయుచున్నాడు. "నేనుచక్కగనా
లోచించి తేల్చుకొనినదృఢాభిప్రాయమును వ్రాయుచున్నాను.
అప్పటప్పటికి రక్తసంబంధమైనట్టికాని వేఱువిధమైనట్టివిగాని
వారసులులేనికారణమున స్వీకారమునకు గవర్నమెంటు అం
గీకారముకావలసినప్పుడెల్ల, చిన్నచిన్నసంస్థానములు సులభ
ముగాచేతులోపడునవకాశమును పోగొట్టుకొనకూడదు."

సతారాసంస్థానమును, నాగపురములోని భోంస్లేగారి
రాజ్యమును, ఝాన్సీలక్ష్మీబాయిసంస్థానము ధార్ సంస్థాన
ము నీసిద్ధాంతముననుసరించియే గుంజుకొనిరి. కేరోలీ మైసూ
రు యీరెండుమాత్రము దైవానుగ్రహమున తప్పించుకొనినవి

ఆంగ్లేయులు మలబారుతీరమున దిగినప్పుడు ఆదరించి
న ఆర్కాటునవాబు రాజ్యముగుంజుకొనియతని నధోగతికిబు
చ్చిరి. తమకత్యంతముసాయపడి హైదర్ వంటి ప్రబలశత్రువు
నోడించుటకును, ఇప్పుడుకాదప్పుడు విదేశప్రభుత్వములనన్నిటి
ని గబళింపనున్న మహారాష్ట్ర శౌర్యమునప్పుడప్పుడరికట్టియ
త్నించిన నైజాము సైన్యమునకీయవలసిన భృతి చాలకాలము
నుండి బాకీపడినాడని యతనిరాజ్యములో మూడవవం

తు నాచికొనిరి. భారతదేశమున దమకునిలువనీడనైన బంగాళానవాబు నజీమును పేరులేకుండ జేసిరి. తాముచెప్పినట్లాటలాడి మహారాష్ట్రులతోనైనయుద్ధకారణమున ద్రవ్యములేనప్పుడు తమకై దుండుగలరూపాయలును, ఆఫ్ఘనులతో యుద్ధముచేసి ద్రవ్యములేదనినపుడు తనయర్ధరాజ్యమిచ్చి, అంతకుముందు తనయువ్వను అమ్మనుదోపించియిచ్చి, యనవరతము పట్టుగొమ్మయైయుండి తానువినాశముజెందినయైన తమ్మునిలువబెట్టిన అయోధ్యనవాబు నేమైనవదలిరా? "నీవుపరిపాలించుట కర్హుండవుకావని పరీక్షించి కనుగొంటిమి. ఇకరాజ్యమునీదికాదని వర్తమానమంపిరి."

మహమ్మదీయులు భారతదేశమున నడుగుబెట్టినదిమొదలు మనవారు (అప్పటిభారతీయులు) గుండెలుచేతులలో బెట్టుకొనియుండిరి. బలవంతముగ మహమ్మదీయమతమున గలుపుకొందురని భయపడుచుండిరి. వారుపెట్టుబాధలకు సహింపలేక తద్బాధావిముక్తికై ఈశ్వరునిబ్రార్థించుచుండిరి. మహారాష్ట్రుల కృపాణముమెఱసి యాత్రాస్థలముల మహమ్మదీయులనుండి తప్పించి, యాసేతుహిమాచలము మహమ్మదీయబలము నడగకొట్టి ప్రజలకొంతయూపిరి పోసికొననిచ్చిరి. వ్రేలుపెట్టనిచ్చిన కాలుపెట్టిక్రమముగా సంసారమునంతటిని భారతదేశమునబ్రవేశబెట్టిన తెల్లప్రభుత్వము మనవారికి మహాభయోత్పాతమును గలిగించినది. దేశముపుట్టినప్పటినుండి ప్రజలసౌఖ్యమునకై నిలచియుండిన పంచాయితీపద్ధతిని రూపుమాపి

తమకోర్టులనుబెట్టి, న్యాయవిధ్వంసముచేయుట. భూమిసిస్తుపద్ధతిలోమార్పులు చేసి యొకటి. దేశీయములైన విద్యలకుమానువిదేశీయవిద్యలనుప్రోత్సహించుట మఱియొకటి. వారిపోషణమున విదేశమునుండి క్రైస్తవబోధకులువచ్చి భారతదేశములదూలనాడుచుండుట వేఱొకటి. ప్రభుత్వమువారుదైజెప్పిన పద్ధతుల నవలంబించి రాజ్యములనులాగికొనుట.

మతముపోవుచున్నదనికొంత, చిరకాలమునుండినిల్చి తమభక్తిప్రేమములజూరగొన్న రాజకుటుంబముల నాశముజేసిరనికనుపుమంటకొంత, ప్రాతనాటిపద్ధతులన్నియు దలక్రిందుజేయుచున్నారనువేదన కొంతప్రజలకు గలిగినది ఇకరాజులసంగతియడుగవలసినదేమి? మంచిమాటలతో దగ్గరకుదీసి నమ్మించి రాజ్యములుగుంజుకొనిరి. అనేకరాజ్యములవిషయములలో రాజులనవమానించిరి. బంగాళావాజుడు యుక్తవయస్సు రానపుడు, అతనితల్లి పాలనకర్త్రిగానుండిన యామెనుద్రోసపుచ్చి యొకభాగమువానినియాస్థానమున నియమించిరి.నాగపురంరాణీగారి సొమ్ములనుపత్రికలలోప్రకటనజేయించి బహిరంగముగా వేలమువేయించిరి. సింధుఅమీరులయెడనిప్రవర్తనము నాగరకుడగుమనుష్యునికెల్ల చూపవలసినదికాదు. రాజులకంచటను భయముపుట్టినది.ఎవ్వనికి తనరాజ్యము నిలుచుననికాని, తనకుతిలోదకమువిడువగలవానికి చెందుననికాని నమ్మకములేకపోయెను. స్వతంత్రతనుపోగొట్టుకొన్నవారలకు లోపల కుములుచుండిరి. తత్ఫలితముగ నొకానొకమహాద్రోహము జనించినది. జాతి

పోయినభారత దేశస్వాతంత్ర్యమును సంపాదించుటకై యొకమహాయుద్ధముజరిగినది. ఆయత్నముజయమునందితమై యుండిన ఈ నాడు మన దేశచరిత్ర వేఱువిధమున వ్రాయవలసియుండి యుండును. 1857 సంవత్సరమున నీయుద్ధముజరిగినది. మనలో శిక్షణ వినయమునను రెండు చక్కగ లేనికారణముననే యపజయముకలిగినది.

౯

భారతదేశస్వాతంత్ర్యయుద్ధముముగిసి భారతీయప్రముఖులందఱు మఱణించి గ్రామములుదహింబడి, జనులు వేపకాయలవలె చెట్లులకు వ్రేలాడదీయబడిన యనంతరమున,నాయుధశాసనము ప్రయోగించి భారతప్రజాసామాన్యమునకు గాజులుతొడిగించి కూర్చుండబెట్టినతర్వాత నింగ్లాండుదేశపురాణిగారగు విక్టోరియారాణిగారు భారతదేశమునకు చక్రవర్తినియై పరిపాలనముదానేవహించెను. ౧౮౫౮ నుండి కుంభిణీవారిప్రభుత్వమంతరించెను. అప్పుడు చక్రవర్తిని దయాకలితమగు ప్రకటనమునొకదానిని గావించెను. అందులో ప్రజలసౌఖ్యమేతనసౌఖ్యమనియు, ప్రజలలాభముకొఱకే పరిపాలనముగావించుననియు, తనదేశమును నెట్లుపాలించుచుండెనో యట్లే యీదేశమును బాలించుననియు, తెల్లనల్లభేదములజేయుటలేదనియు, మతవిషయములలో జోక్యముకలిగించుకొనుట లేదనియు వాగ్దానముచేయబడెను. కుంభిణీవారి పాలనమున గందరగోళపడియుండిన జనులుసంతోషించిరి. కాని ఆంగ్లేయులు ఇవికార్య

రూపకముగా బొల్చినపాపముననెన్నిటికిని బోలేదు!

భారతదేశమునగూడ నాంగ్లదేశములోని సంస్థలనమూనాలనే గ్రమముగదించుటకు బ్రయత్నించుచున్నారు. కాని ప్రాణములేనిబొమ్మలనుమాత్రమే భారతదేశమునునిల్పుచున్నారనుటమాత్రము మరవకూడదు.

కలకత్తా బొంబాయి, మదరాసు అనుమూటిని మూడురాజధానులకు ముఖ్యపట్టణములుగభావించి, యామూడుస్థలములముగ్గురు గవర్నరుల కుంభిణీవారునియమించియుండిరి. వీరికాలోచనచెప్పుటకు కొందఱుసభ్యులుమాత్రముకల సభలుండెడివి. ఇంగ్లాండుశాసనములను వీరుజారీచేయుటమాత్రమేకాని వానికివ్యతిరేకముగ బ్రవర్తింపరాదు. నేతిబీరకాయ యనునట్లు యిదియేయప్పటి రాష్ట్రీయశాసనసభ. భారతదేశమునకు మొత్తముమీద శాసనసభ బీజప్రాయముగ ౧౭౭౩లో కలిగినది. ఈసంవత్సరమున పార్లమెంటువారు రెగ్యులేటింగ్ ఆక్టుఅని ఒక చట్టమును జేసిరి. కుంభిణీవారుచేయువ్యాపారము పరిపాలనము మొదలగునవి ఇంగ్లాండుదేశముయొక్క లాభమునకు బ్రతిష్ఠకుసంబంధించినవికనుక భారతదేశవ్యాపారములో ఇంగ్లాండుదేశప్రజనులు జోక్యముకలిగించుకొనిరి. పార్లమెంటుఅనగా ఇంగ్లాండుదేశప్రజనుల ప్రతినిధులుసభయేకదా? మొత్తముపై భారతదేశమంతటికి గవర్నర్ జనరల్ గారను నొకయధికారిని నియమించిరి. నలుగురుసభ్యులుగల యొకసంఘము అతనిమంత్రాంగము. బొంబాయిమొదలగురాష్ట్రముల

గవర్నరులువారియాలోచనసంఘములు వీరికిలోబడియుండవలెను. న్యాయవిచారణమునకై యొకకోర్టుయేర్పడెను. ఈగవర్నర్ జనరల్ కాని, జడ్జీలుకాని తప్పుచేసినయెడల యింగ్లాండులోని కింగ్స్ బెంచ్ యనుకోర్టుకు వీరినిశిక్షించు అధికారముకలదు. ఇంగ్లాండులోనిజనులు నియమించినపార్లమెంటుచే బంపబడిన గవర్నర్ జనరలు గవర్నరులుభారతదేశమును పాలించుట. ఇదియే భారతదేశ దాస్యమునకంకురార్పణము.

౧౮౩౩లో ఇండియాగవర్నమెంటుఆక్టుఅని ఇంకొకచట్టమువచ్చినది. దానిప్రకారము కంట్రోలింగ్ బోర్డుఅని, ఇండియాపరిపాలనము నడిపించుటకు పార్లమెంటుతరపునయొకసంఘము ఇంగ్లాండులోనేర్పడెను. ౧౮౫౮లో రాణీగారుచక్రవర్తినియైనపుడు ఇండియాకౌన్సిలు ఆక్టుఅని మఱియొకచట్టమువచ్చెను. దానిప్రకారముఇండియాకౌన్సిలుఅను సంఘముఏర్పడెను. దానికధ్యక్షుడుగానుండువారు ఇండియారాజ్యాంగమంత్రియనబడును. అందుసభ్యులు ౧౫మంది. అయినపై నామకార్థము పార్లమెంటుకధికారము. ఈకౌన్సిల్ ఇంగ్లాండులోనుండి భారతదేశపాలనమునడిపించును. దీనిఖర్చులు భారతదేశమే భరింపవలెను. ౧౮౬౧లో ఇండియాకౌన్సిలుఆక్టు అనుచట్టమునిర్మింపబడెను. దీనిప్రకారముగవర్నర్ జనరల్ ఆలోచనసంఘములో ౫గురుసభ్యులుండవలెను. సైన్యాధిపతి, బారిస్టర్, పదిసంవత్సరముల భారతదేశానుభవముకలిగినవారందులో సభ్యులు. అదికాక చట్టములుచేయుటకుమాత్రము వే

ఆలోకసంఘము గవర్నర్ జనరల్ గారే స్వయముగానిర్మింపవలెను.ఆర్గురకుతక్కువకాకుండ ౧౨గురకుమించనిసంఖ్యసభ్యులు. అందులోసగమునకు తక్కువకానిసంఖ్య అనుద్యోగులుండవలెను.వీరికిచట్టములుచేయు నధికారమున్నదని పేరేకాని,భారతదేశమునకుగాని, ప్రజలమతమునకుగాని, స్వాతంత్ర్యమునకుగాని, నావికాదళమునకుగాని సైన్యమునకుగాని, విదేశమునకుగాని సంబంధించినవిషయములలో గవర్నర్ యనుమతిలేక యేమియుజేయరాదు. శాసనతుల్యములగు ఉత్తరువుల గవర్నర్ గారే అత్యవసరసందర్భములలో చేయవచ్చును. తర్వాత ఈకౌన్సిలునుగూర్చి ౧౮౬౧ మొదలు ౧౮౭౪ వరకు అప్పటికప్పుడు కొన్నిమార్పులు చేయబడినవి. ౧౮౯౨లో మరల గవర్నర్ జనరల్ గారి కౌన్సిలులోను గవర్నర్ల కౌన్సిళ్లలోను సభ్యుల సంఖ్యయెక్కువచేయబడెను. ౧౯౦౯ సంవత్సరములో మార్లె సంస్కరణములు వచ్చువరకు ఈకౌన్సిలులో ప్రజాప్రతినిధులు వాసనకైనాలేరు.

ఈసంబంధమున దేశీయమహాసభయొక్క (కాంగ్రెసు యొక్క) చరిత్రముగొంచము తెలిసికొనవలసియున్నది. జనులలోనిరాజకీయవిజ్ఞానమును స్వాతంత్ర్యేచ్ఛను రగులుకొల్పి రాజ్యాంగపద్ధతులలోని మార్పులకుముఖ్యముగ కారణమైన సంస్థ యదియే.ఈదినమునకుకూడ భారతదేశజాతీయసంస్థ యనుపించుకొనదగిన దదియొక్కటియే.

రాణీగారుప్రభుత్వమువహించిన నాటినుండి వారినాగ్గా

సములలో నొకటియు చెల్లింపబడలేదని ప్రజలప్పుడప్పుడు మొఱపెట్టుకొనగా యేవియోసాకులుజెప్పి తప్పించుకొనుచుండిరి. తుదకు రాజ్యాంగవేత్తల లౌకికప్రసంగములకు వారికార్యాచరణములకు సంబంధములేదని కర్జన్ ప్రభువుగారే చెప్పిరి.

౧౮౮౫లో గవర్నర్ జనరల్‌గానుండిన డఫ్రిన్ దూరాలోచనగలవాడు. ఇంగ్లీషురాజ్యము సురక్షితముకావలయునని భారతీయప్రజల యభిప్రాయములు తెలిసికొనుట ముఖ్యమగు కారణమున అప్పుడు ప్రభుత్వోద్యోగియైన హ్యూందొరగారిని ప్రోత్సాహపరచిరి. హ్యూంగారికి భారతదేశముపై సహజముగ గొంతప్రేమగలదు. అప్పుడు దేశక్షేమాభిలాషులుగానుండిన దాదాభాయ్ నౌరోజీమొదలగువారితో సంప్రతించి భారతదేశీయ మహాసభను (Indian National Congress) ౧౮౮౫లో స్థాపించిరి. మొదలుప్రభుత్వమువారి యుపయోగమునకై యేర్పడిన ఈసభను, దేశీయనాయకులు ప్రజలలో రాజకీయప్రబోధముగావించి, ప్రజలకోర్కెలను నెరవేర్చుటకు ప్రభుత్వమువారిని లొంగదీయుటకై వినియోగించిరి.

భారతదేశీయమహాసభ ప్రారంభదశలో ప్రార్థనపూర్వకములగు తీర్మానములమూలమున ప్రజలకష్టసుఖములను ప్రతిజనవరిసెలవులలో గవర్నమెంటువారికి దెలుపుచుండెను. ఆ తీర్మానములను బుట్టదాఖల్ చేయించుచుండిరి. ౧౯౦౬లో ౨౨వ దేశీయమహాసభ కలకత్తాలో జరిగినపుడు దాదాభాయ్ నౌరోజీగారధ్యక్షపదవినుండి స్వరాజ్యమంత్రమునుపదేశించి

రి. అప్పటినుండికాంగ్రెస్మతము "బ్రిటీష్సామ్రాజ్యమునకు లోబడిన స్వరాజ్యమునార్జించుట" గాఏర్పడినది. కలకత్తాకాంగ్రెస్ జరిగిన 3మాసములలో స్వరాజ్యమనుట రాజద్రోహమని కొందరను ప్రాసిక్యూషన్ చేసిరి.అప్పుడుజడ్జిగా రాకోరికలో నే మిందుతప్పు లేదని వారినివదలివేసిరి. అప్పటినుండి నిరాఘాటముగ నాపదమునువాడుచున్నారు.

దేశీయనాయకులలో మితవాదులని అతివాదులనికొంతభేదముండెడిది. ముందడుగువేయుదమను నిర్భీకులు అతివాదులు. మానమునేమము లెక్కించుచు పరాలంబనమునపేక్షించువారు మితవాదులు. ఈరెండుపక్షములతగాదాలతో ౧౯౦౭లో సూరత్ లోచేరిన దేశీయమహాసభ వీగిపోయెను. తర్వాత ౧౯౧౨సంవత్సరమువరకు ఆసభ మితవాదులు తమస్వాధీనమునందేయుంచుకొని యతివాదులరానీయరైరి. ఆసంవత్సరము ఆనిబిసెంటమ్మగారును దేశీయసభాకార్యదర్శిగారగు న్యాపతిసుబ్బరావుపంతులుగారును కొంతకృషిసలిపి తిలక్ము న్నగు అతివాద నాయకులనుగూడ దేశీయమహాసభకుగొనివచ్చిరి.

౧౦

నౌరోజీగారియధ్యక్షతక్రింద జరిగినకాంగ్రెసుకు ముందే ౧౯౦౫వసంవత్సరమున బంగాళాదేశము కర్జన్ప్రభువుగారిచే రెండుగావిభజింపబడినది. ఒకేభాషమాటలాడుజనులను రెండుగావిభజించుటన్యాయమనియు, వారిలోనినైకమత్యమునకు

భంగకరమనియు జెప్పుకొనిన ప్రజలమాటలకు విరుద్ధముగ నావి భజనముజరిగియుండుటచే, మొదలుబంగాళాజనులయొక్కయు తర్వాత భారతదేశమంతటయొక్కయు, మనస్సుచాలాసంక్షోభించినది. అప్పుడే స్వదేశోద్యమ మారంభమైనది. స్వదేశవస్తువులనే వాడవలయునను నిర్ణయము బంగాళాయందంకురించి భారతదేశమంతటికి వ్యాపించినది. ౧౯౦౬లో జరిగినకాంగ్రెసులో స్వదేశవస్తుస్వీకరణదీక్ష, విదేశవస్తుబహిష్కారము జాతీయవిద్యయనునవి స్వరాజ్యమునకు సాధనములుగానొనిరి. కాంగ్రెసుయొక్కమతమునసనుసరించి శాసనబద్ధమైనట్టియు క్రమాగతమైనట్టియు సాధనములే స్వరాజ్యసంపాదనమునకు వినియోగింపవలసినవిగానుండ బంగాళాయువకులలో రక్తముడికి, కత్తిబట్టియైనను తెల్లవారినిబారద్రోలవలయునని యిష్టముకలిగినవి. వందేమాతరమనుమాట అప్పుడేప్రచారమునకువచ్చినది. ఉద్రేకముహెచ్చినకొలది దేశద్రోహులతలలెగురజొచ్చెను. అప్పుడెందఱోదేశాభిమానులగు భారతయువకులు జెయిళ్లకుజోయిరి, ఉరివేయబడిరి. ద్వీపాంతరములకు బంపబడిరి. అట్టిసందర్భములలోనే దేశసేవకులలోప్రముఖులగు గాడిచెర్లహరిసర్వోత్తమరావుగారుగూడ రాజద్రోహముపురికొల్పిరనుకారణమున శిక్షింపబడిరి. ఆయాందోళనఫలితముగ ౧౯౦౯లో రాజ్యాంగమున కొంతమార్పుకలిగెను. ఆమార్పుపేరే మార్లేసంస్కరణములు.

మార్లేసంస్కరణముల ననుసరించి శాసనసభలు విరివి

యూయెను. ఇండియాసభలో అనుద్యోగసభ్యులకంటె నుద్యోగసభ్యులసంఖ్యయే యధికము. రాష్ట్రీయసభలలో అనుద్యోగపభ్యులసంఖ్యయే యధికము. శాసనసభలకధికారమనేకవిధములపరిమితమైనది. శాసనసభతీర్మానములు సలహాప్రాయము లేకాని నిర్బంధముగ నెరవేర్పవలసినవికావు. ౧౯౦౨ వరకు నీ సంస్కరణములే యాచరణయందుండినవి.

౧౯౧౪ సంవత్సరముననే ఐరోపామహాసంగ్రామ మారంభమైనది. అప్పుడే అనిబిసెంటమ్మగారు "న్యూయిండియా" యనుఆంగ్లపత్రికను స్థాపించిరి. హోంరూల్ ఉద్యమమని యొకయుద్యమమును లేవదేసి, పత్రికాముఖమున భారతీయులకు కాంగ్రెస్ కోరుచుండు స్వరాజ్యముకావలెనని ప్రబలముగు నాందోళనముగావించిరి. అనిబెసెంటుగారికి శిష్యకోటి విశేషమగుటచేతను, మహాయుద్ధముకారణముగ జనులలో పత్రికలు చదువుట మిక్కిలియధికమైనందునను, బిసెంటుగారుభారతదేశముపట్ల గలయవ్యాజానురాగముతోబాటు మొక్కవోనిధైర్యమును మేళవించి వ్రాయుచు నుపన్యసించుచు నుండుటచేతను, జనులలో చాలాప్రచారముజరిగి మంచికదలికను గలిగించినది. అప్పుడామెచేసినసేవ ప్రశంసాపాత్రము.

హోంరూలు ఉద్యమముపేరుతో స్వరాజ్యాందోళనముచేయుచున్నను, మహాసంగ్రామమునకుమాత్రము భారతదేశమంతయు ధనరూపమునను సైన్యరూపమునను విశేషసహాయముచేసెను. భారతయోధులుసామ్రాజ్యమును నిలువబెట్టిరి

తత్ఫలముగ మఱలరాజ్యాంగములో గొంతమార్పుజరిగెను. ఆ మార్పునకే మాంటేగ్యుసంస్కరణములని పేరు.

౧౯౨౦ వసంవత్సరమున నివియాచరణలోనికి వచ్చినవి. వీనినేద్వంద్వప్రభుత్వపద్ధతియని కూడనందురు. ఇంగ్లాండులోని పార్లమెంటువలెనే భారతదేశ శాసనసభ రెండువిధములు. ప్రజాసభకే మోఅసెంబ్లీయని పేరు. ప్రభుసభకే మో స్టేట్ కౌన్సిలుఅని పేరు. పార్లమెంటులోని రెండుభాగములకు యెన్నికలపద్ధతియేమో ఈ రెంటికినట్టిదే. ఈ రెండునుచేరి శాసనసభయగును. వైసరాయ్ తనకార్యనిర్వాహకసంఘ సహాయముతోను ఈభారతదేశ శాసనసభాసహాయముతోను పరిపాలనముగావించును. కార్యనిర్వాహకసభ్యులుగూడ నుద్యోగరీత్యాప్రజాసభలోసభ్యులే. వైసరాయ్మాత్రముకాదు. వైస్‌రాయ్‌గారికి రెండధికారములుగలవు. శాసనసభలు, చేసినదానినితనకిష్టములేకున్నత్రోసివేయుట. ఈయధికారముపేరు వీటో(Veto)అందురు. తనకిష్టమైనదానిని త్రోసివేసిన దానినుద్ధరించుఅధికారమింకొకటిదీనినేసర్టిఫికెట్ (Certificate)అధికారమందురు.

ఇకప్రజాసభలోని సభ్యులలో ఎన్నికసభ్యులే యధికసంఖ్యాకులనిపేరేకాని నిజముగ దేశక్షేమమునుగోరువారుకొందఱేయుందురు. కారణమేమనగా చాలస్థానములు దేశక్షేమమునుగోరుటకువీలులేని వృత్తులకు ఆతెగలకునై ప్రత్యేకింపబడినవి.

రాష్ట్రీయప్రభుత్వములో గమనింపదగినది ద్వంద్వప్రభుత్వము. ప్రభుత్వములోననేకయిలాఖాలు (ఆబ్‌కారి, పోలీ

సు, రివిన్యూ ఫారెస్టు మొదలగునవి) కలవుకదా? వానిలో రెండు తెగలు కలవు. రాబడి కలవి కొన్ని, ఖర్చు మాత్రము కలవి కొన్ని. రాబడి కలవన్ని గవర్నరుగారి యొక్కయు వారి కార్యనిర్వాహక సంఘము యొక్కయు నధీనమున నుండెను. ఈ యిలాఖాలకు రిజర్వుడి పార్టుమెంటులని పేరు. శాసనసభలో నెక్కువ పలుకుబడి కలిగిన కక్షకు జెందిన నాయకుని గవర్నరు ప్రధానమంత్రిగా జేయును. ఆయన తనకు సహాయులుగా మఱియిద్దఱు మంత్రుల నేర్పరచుకొని రాబడి లేని ఖర్చు శాఖల బాలించుటకు బూనును. గవర్నమెంటువారి సైన్యము మొదలగు దేవతాయిలాఖాలకు ద్రవ్యము విశేషముగ గావలసినందున మంత్రుల స్వాధీనములోని యిలాఖాలకు ఎప్పుడు సగము కడుపే. సగము కడుపు తిండి తినువారి దేహముద్రుఢము కాలేక పోయిన మంత్రులు చక్కగా పాలింపలేదు. ద్రవ్యము కావలసిన యెడల మంత్రులు శాసనసభల ప్రోత్సహించి క్రొత్త పన్నులు వేయించుకొనవచ్చును. అట్లు వేయించుకొనిన మంత్రులు ప్రజలకు కంటకులగుదురు. నైసరాయికిగల సర్టిఫికేట్ విటో అధికారములు గవర్నర్లకు గూడ గలవు. ఈసంస్కరణములు మితవాదులకుగూడ తృప్తికరముగ నుండలేదు ఎట్లుండినను నది నాచరణయందు బెట్టి చూపుటకు నాయకులందఱు వ్యతిరేకులుగనుండిన యువకుల మందలించుకొని, సంసిద్ధులైరి.

ఈసంస్కరణముల పైచర్చ జరుగుచుండగనే ౧౯౧౯ లో పంజాబులో ఘోరవధలు అక్రమచర్యలు జరిగెను. సైనిక

పాలనము జరిపించిరి. జనులనుకొరడాలతో గొట్టించి, పొట్టల పై బ్రాకించిరి. ఉరిశిక్షల వేసిరి. ధనమునపహరించిరి. తుదకు చేరియుండిన గొప్పసమూహముపై మెషీనుఫిరంగుల వర్షముగురిపించి యాబాలగోపాల మనేకవందలజనుల నాశముచేసిరి. స్త్రీల కవమానభంగము జేసిరి. అవివేకముచేతను దుర్బుద్ధిచేతను దమ యుద్యోగులదండించుటకుమారు వారినిక్షీనియాడి వారికిపింఛనులిచ్చి బహుమానములిచ్చి సామ్రాజ్యమునిలునబెట్టినవార నిభూషించిరి ప్రభుత్వాధికారులు.

యుద్ధసమయమున భారతదేశపు మహమ్మదీయులకు ఖిలాఫత్ విషయమున జేసినవాగ్దానముల నెగురగొట్టి వారిప విత్రస్థలముల దాముగూడనాక్రమింపఆంగ్లప్రభుత్వమువారుద్దేశించిరి. ఇదిమహమ్మదీయులపట్లచేసిన నమ్మకద్రోహమనుటకు సందేహములేదు.

పంజాబులోనిహత్యలకును, ఖిలాఫత్ విషయమున జేసిన యన్యాయమునకునుపరిహారము జేసికొనువరకును, ఇటువంటివి కమీదజరుగకుండుటకు సాధనమై, ప్రజలజన్మహక్కుగ స్వ రాజ్యము నిచ్చుటయుజరుగువరకు యీప్రభుత్వమునకు సాయపడుట ఘోరనరకమని గాంధిమహాత్ముడు అసహాయో ద్యమమును లేవదీసెను. అఖండమగుప్రబోధము కలిగించెను. జనులలోనుండు స్వాతంత్ర్యేచ్ఛ నొక్కసారివిజృంభింపజేసెను. అక్రమపాలనముపట్ల తిరస్కారభావము పురికొల్పెను.౧౯౨౦ వసంవత్సరమున నాగపురమునజరిగినకాంగ్రెస్‌లో, "బ్రిటీషు

బాన్పుటాకులోబడి" యనుమాటలనుదీసివేసి, "ధర్మసమ్మతమైనట్టియు, శాంతియుతమైనట్టియు పద్ధతులతో భారతదేశమునకు స్వరాజ్యముసంపాదించుటయే దేశీయమహాసభయొక్క ఉద్దేశమని నిర్ణయింపబడెను. ఇంతటితో భయముచేతనో భక్తిచేతనో స్వరాజ్యమునకన్న బ్రిటీషువారియాధిపత్యమే యెక్కువని భావించినపెద్దలందఱు కాంగ్రెస్‌నుండి లేచిపోయిరి. ఈమార్పునకు కారకుడైన గాంధిమహాత్ముడు జంకలేదు. ఇన్నిదినములనుండి కాంగ్రెసునకు విద్యాధికులమాత్రమే సంబంధముండిన కారణమున ప్రజాశక్తి విజృంభింపలేదని గ్రహించెను. ఆకారణముచేతనే ప్రజలకుసంబంధించిన అసహాయోద్యమమును సాధనముగ ననుగ్రహించెను.

ఏయుద్యమమునందు సహాయముచేయకుండుట ప్రధానాంశమో ఆయుద్యమ మసహాయోద్యమము. గవర్నమెంటుప్రతిష్ఠకునేయేవి తోడ్పడునో వానివానియందు సహాయులముగాకుండుట సహాయోద్యమము నవలంబించుట. ఈప్రభుత్వపద్ధతినష్టము. ఆపద్ధతి, ప్రతిష్ఠకు, పట్టుగొమ్మలైయుండునవన్నియు త్యజింపవలెను. ఇట్లుచేయుటచేత ప్రభుత్వమునెడల ప్రజలకు గలుగువ్యామోహము పటాపంచలైపోవును. నాశముచేయుదృష్టియేకాక నిర్మించుదృష్టికూడ ఈయుద్యమమునందిమిడియున్నది. గవర్నమెంటువారికోర్టులను బహిష్కరింపవలెను. కానిపంచాయతీల నిర్మింపవలెను. బ్రిటీష్‌ప్రభుత్వ పాఠశాలల బహిష్కరింపవలెను. కానిజాతీయవిద్యాలయముల నెలకొల్పవలెను.

విదేశవస్త్రములను మిల్లుబట్టలను బహిష్కరింపవలెను. కానిరాటము చేతబట్టి మనకుటీరములో సగము కడుపునకుగూడగానని బీదలో మనతోబుట్టువులుమొదలగువారో వడికిననూలును చక్కజేసి మనసాలెవాడు నేసినబట్టలనే ధరింపవలెను. ప్రభుత్వపుశాసనసభలను వదలవలెను. అంతటితో నూరకుండక జాతీయసంఘములలో కృషిచేసి జాత్యభివృద్ధికి బూనుకొనవలయును. వేయేల! దుష్టములగాని, దుష్టకార్యములకు తోడ్పడునట్టికాని వర్తనముమాని ధర్మమార్గముల నవలంబింపవలెను. ఇదియే అసహాయోద్యమము.

దీనికి అహింస ప్రథమమైన అంగము. అదిసహాయోద్యమమునకుప్రాణము. చెడ్డకుతలయొగ్గకూడదు. దానినిసాత్వికముతిరస్కరింపవలెను. అట్లుతిరస్కరించుటలో ధనప్రాణహానికి జంకరాదు. శతృచర్యల తీవ్రముగ ఖండింపవచ్చునుగాని వారినితిట్టుటయు గొట్టుటయుగూడదు.

ఈయుద్యమము జనులను బాగుగనాకర్షించినది. వేలకువేలు లక్షలకులక్షలు జనలు అసహాయోద్యమమున బాల్గొనిరి. బళ్లువదలిరి. వకీళ్లవృత్తులనువదలిరి. బిరుదులువదలిరి. ఉద్యోగములువదలిరి. మిక్కిలిపెంపనేల! తమసర్వస్వమును భారతమాతృపాదసన్నిధి నర్పించి బిక్షుకత్వముగైకొనినవారుగలరు. ఆధర్మమునకై ప్రాణములనేయర్పించినవారుగలరు. ఇక ముప్పదివేలజనులు కైదులోనుండిరనుట యేటిలెక్క? ప్రస్తుత ప్రభుత్వమంతయుకుంకుటప్రేళ్లతో నల్లాడినదని యంవఅకుచెలి

సినవిషయము! ఎప్పుడుమహాత్ముఁడు బార్డోలీలో శాసనోల్లంఘనము ప్రారంభించునోయని భయపడుచుండిన ప్రభుత్వమునకు చౌరీచౌరాయల్లరులువచ్చి కొంతయూపిరి బుచ్చుకొనునవకాశము నొసగెను. ఆయల్లరులతో మహాత్మునికి దేశముయొక్క నిజస్థితిగోచరించి శాసనోల్లంఘనమాపివేసెను. గవర్నమెంటుకు ధైర్యమువచ్చి నాయకులందఱు జైళ్లలోనుండగా మహాత్మునిమాత్రమేటికి వెలుపలనుంచవలెనని ౬ సంవత్సరములుశిక్షజెప్పి జెయిలుకుబంపిరి.

౧౧

బంగాళానాయకుడగు చిత్తరంజనదాసు చెరనుండి వెలుపలికిరాగానే ప్రభుత్వమువారియకృత్యములకు వెఱగందిజనులునిరుత్సాహులై యుండుటచూచెను. అసహాయవాదమునను సరించి ప్రజాసేవకులందఱు కౌన్సిళ్లనుద్యజించియుండ స్వార్థతత్పరత్వమున కౌన్సిళ్లలోప్రవేశించినవారు జాతీయోద్యమమునకు దోడ్పడుటకుమారు అసహాయోద్యమమునుదిట్టి, గాంధిని తిట్టి, దేశసేవకులను కారాగారములనుంపజేసియుండిరి. ఏమిచేసినను దేశమునకుత్సాహముకలుగునట్లులేదు. జనులకుత్సాహముగలిగించుటకును, కౌన్సిళ్లమూలమున జాతీయోద్యమమునకు గలుగునష్టములవారించుటకును, ప్రభుత్వపురంగును బయటవేయుటకును అసహాయవాదులు శాసనసభలలోనికి బోవలెనని దాసుగారుప్రచారముగావించిరి. తొలుతవారివాదమునకు తీవ్రమగునాక్షేపములు గలిగినను, స్వరాజ్యపార్టీయను దాసు

గారిపక్షము తమకక్షుపేరుతో కౌన్సిళ్లలోనికి ప్రవేశింపవచ్చునని కాకినాడాకాంగ్రెసులో ౧౯౨౩లో తీర్మానింపబడెను. కాంగ్రెస్‌వారామోదించి యుండనికారణమున అంతకుముందేజరిగిన శాసనసభలకు అసహాయవాదులనేకులు సభ్యులుగాపోజాలకపోయిరి. బంగాళాలోనేమి, మధ్యపరగణాలలోనేమి, స్వరాజ్యపక్షసభ్యులు కౌన్సిళ్లలోయెక్కువైనకారణమున, ద్వంద్వపరిభుత్వమును రూపుమాపిరి. ఢిల్లీశాసనసభలోగూడ నధికముకాని తమసంఖ్యతోనే, ఇతరులసాయము పొందవలయునప్పుడెల్ల ప్రభుత్వమువారినోడించి, ఈప్రభుత్వము మేకతోలుగప్పికొనిన పులియనునదికొంతవ్యక్తముచేయగలిగిరి.

౧౯౨౪వ సంవత్సరమున అనారోగ్యమును మిషపెట్టి గాంధిమహాత్మునివదలిరి. అప్పటికినాయకులందఱు కారాగారములనుండి వెలువడియుండిరి. బెల్గామున ౧౯౨౪వ మహాత్ముని యధ్యక్షతక్రిందజరిగిన కాంగ్రెసులో శాసనసభాప్రవేశమిష్టమును కొంతవఱకంగీకరింపబడెను. చిత్తరంజనదాసుగారు దేశసేవయందు జీర్ణించినశరీరముతో భారతదేశదురదృష్టవశమున ౧౯౨౫వ సం॥ జూన్ నెల ౧౬వ తేది కీర్తిశేషులైరి.

౧౨

బంగాళాలో స్వరాజ్యపక్షపుచర్యలమూలమున ప్రభుత్వపరిపాలనము స్తంభించిపోయెను. ప్రభుత్వప్రతిష్ఠకు భంగము కలిగినకారణమున బెంగాల్ ఆర్డినెన్సు అనునొక్క పురాతనాస్త్రమును మఱలనుపాసించి ప్రభుత్వమువారు ప్రయోగించి

స్వరాజ్యపక్షప్రముఖులగువారి ననేకులపట్టుకొని విచారణచే యక నేరమును నిరూపింపక దూరభూములకుగొనిపోయి చెఱలలోనుంచిరి. ప్రభుత్వాధికారుల ఈచర్యస్వరాజ్యపక్షమునణచుటకే యుద్దేశింపబడినదని దానికివ్యతిరేకముగ తనధర్మమునకువిరుద్ధముకానివిధమున మహాత్ముడు ఆకక్షనుబలపరుపసాగెను. కాన్పూరులో ౧౯౨౫లో జరిగినకాంగ్రెసులో స్వరాజ్యపార్టీవారిని కాంగ్రెసుయొక్క రాజకీయవిషయ నిర్వాహకులుగానేర్పాటుజేసి కాంగ్రెస్ పేర వారుకౌన్సిళ్లకుబోవచ్చునని నిర్ణయింపబడెను.

ఢిల్లీశాసనసభలలోని, స్వరాజ్యపక్షసభ్యులు, జిన్నామాళవ్యాప్రభృతులగు స్వతంత్రపక్షసభ్యులు ఒకవిధానమును నిర్ణయించి యావిధానముమేరకు వారికోర్కెలదీర్చవలయుననియు, దేశమునకుగావలసినదానిలో వారుకోరినది తక్కువలో తక్కువయనియు నంతమాత్రపుమార్పుగూడ కలిగింపకుండిన ప్రభుత్వమువారిహృదయము కరుగనట్లనియు, నాకారణమున తాము వారికి తోడ్పడజాలమనియు దెల్పియుండిరి. చిత్తరంజనదాసుగారుగూడ ఫరీద్‌పురసభలో గవర్నమెంటువారిహృదయమునుమారిన గుర్తుకనుపించిన ప్రభుత్వమువారితో సహకారముజేయుదురని తెల్పియుండిరి. కాని నిన్నమార్చిసభవరకువేచినను మార్పుకలుగలేదు. ఇంచుకంతసూచనగూడ గనుపింపలేదు. మీదుమిక్కిలి బ్రిటీష్‌పాలకవర్గమువారు నిరాశచేసికొందు అనుదీతిని మాటలాడుచున్నారు. ఈకారణములన్నిటిచే

త ఈమార్చి నెలలో భారతదేశములోని యన్నికౌన్సిళ్లలో నుండి జాతీయగౌరవముమనస్సునగల సభ్యులందఱు ఆచర్యల లోపాల్గొనక తమయసంతృప్తిని తెల్పుటకై లేచివచ్చిరి.

స్వరాజ్యపక్షములో కొంతచీలికకలిగినది. ఉద్యోగ ములస్వీకరించి యథోచితముగ సహాయముచేయుదమను మహా రాష్ట్రపక్ష మొకటి! ఉద్యోగములుస్వీకరింపక నిరోధమునే సాగిం పవలెనను పక్షమింకొకటి. ఈ రెండుపక్షములుపోరాడి చివరకు కాంగ్రెసులోమాత్రి ముద్యోగస్వీకార మోడిపోయెను.

భారతదేశముయొక్క భవితవ్యమంతయు నీనాయకుల పైనున్నది. జనసముదాయముపైనున్నదికాని వీరిపైనేమియు లే దనుకొనరాదు. ఏలన నాయకులు తమలోవాదులాడుచుండ ప్రజలునడువవలసిన మార్గముకానరాక సంభ్రము లైనారు. స్వ లాభపరత్వమునుసూచించు నుద్యోగకాంక్ష గలసంఘము నట్ల ప్రజలకువిశ్వాసముండజాలదు. ఉద్యోగవాంఛచేతను నిత రులపై ద్వేషముచేతను బ్రారంభింపబడిన జస్టిసుపక్షముస్థితి నే టికెట్లున్నదో చూచిన నుద్యోగవాంఛస్వరాజ్యము చేరువకు దెచ్చుటకుమారు పదియంతలుదూరము చేయుననుటతప్పక స్ఫురించును. ఈసత్యమునాయకులకు గోచరింపజేసి ఈశ్వరు డుభరతదేశము ననుగ్రహించుగాక!

వందేమాతరం



# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 7 | తుమముట్ట | తుదముట్టి |
| 6 | 8 | పుచ్చుదురు | పుచ్చెదరు |
| 6 | 10 | యనిచెప్పి | యనియుచెప్పి |
| 7 | 6 | పుచ్చుదురో | పుచ్చెదరో |
| 9 | 7 | విజానము | విజ్ఞానము |
| 10 | 6 | ముఖ్యులుగ | ముఖ్యముగ |
| 11 | 15 | త్రికోణా | త్రిభుజా |
| 16 | 10 | పదవి | మున |
| 18 | 20 | సామ్రాజ్వము | సామ్రాజ్యము |
| 19 | 4 | జేచేసి | చేసి |
| 19 | 14 | అంఖండ | అఖండ |
| 19 | 15 | సామ్ర్యాట్టు | సామ్రాట్టు |
| 22 | 2 | చాలా | చాల |
| 23 | 20 | స్థలములల | స్థలముల |
| 26 | 3 | బట్టి | బట్ట |
| 27 | 12 | సైన్యముము | సైన్యము |
| 29 | 6 | కష్టము | నష్టము |
| 38 | 1 | యెలుకల | యొతికల |
| 38 | 2 | లాగికొనిరి | లాగికొనినది |
| 38 | 10 | వలెనను | వలెను |

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 39 | 2 | మన | మను |
| 39 | 8 | నట్టివి | నట్టి |
| 44 | 15 | అయన | ఆయన |
| 45 | 21 | దది | దిది |
| 46 | 9 | మునప్పై | ముప్పై |
| 46 | 13 | స్థాంచిరి | స్థాపించిరి |
| 49 | 12 | దోళణము | దోళనము |
| 53 | 8 | విధ్యార్థికుల | విద్యార్థికులకు |
| 53 | 18 | ననింది | నంది |
| 54 | 22 | కుంకుట | కుంకుటి |
| 55 | 22 | క్షేపములు | క్షేపణాలు |
| 56 | 8 | పొందవలము | పొందవీలయిన |
| 56 | 15 | ఇష్టముమ | ఇష్టమని |
| 57 | 13 | మాత్రిను | మాత్రిము |



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B132 |
| పుస్తకం పేరు | భారత దాస్యము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | n/o |
| వెనుక అట్ట | n/o |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | n/o |
| ఖాళీ పేజీలు | ii, IV |
| లేని పేజీలు | n/o |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |